# ఎఱ్ఱ బుట్టలు

[ దృశ్యనాటకలు ]

రచయిత:
ధనికొండ హనుమంతరావు

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

వెల
రూపాయిన్నర

హెచ్చరిక

ఈ నాటక ప్రదర్శనకు గ్రంథకర్త
లిఖితపూర్వక అనుమతి అవసరం.

మొదటి ముద్రణ 1948
రెండవ ముద్రణ 1954

శ్రీ కొండపల్లి ముద్రాశాల,
రాజమండ్రి.

# విషయసూచిక

# ప్రొఫెసర్ బింద్సన్

చిన్న ఆఫీసుగది. శుభ్రంగా, అందంగావుంది. గది గోడలకు రకరకాల హిందూ దైవాల చిత్రాలు వేలాడుతున్నాయ్; అన్నిటికన్న కాళికాదేవి చిత్రం చాలా పెద్దది. ఆమె గొప్పతనాన్ని సూచించేందుకు, మిగతా దైవాలకు అన్యాయంచేసి, తనుమాత్రం పూలమాలల్తో అలంకరించు కుంది.

గదిమధ్య పెద్ద టేబులూ; దానిమీద రకరకాల ఆఫీసు ఫైల్సూ, ఒక కాలింగ్ బెల్లూ, కలాలూ, సిరాబుడ్లూ, ఇంకా ఇలాటి ఇతర స్టేష నరీ సామాన్లూ అమర్చబడి వున్నాయ్. గాజుతలుపులు బిగించబడ్డ కిటికీ ల్లోంచి, ఉదయభానుడు తొంగిచూస్తున్నాడు.

మిస్ మేరీ—తనకు కావల్సిన ఫైల్సుకోసం వెతుకుకుంటూ కూని రాగాలు తీస్తోంది. ఆమె అందమైన ఆంగ్లో-ఇండియన్ యువతి అనేం దుకు ఎవ్వరూ నిరాకరించరు. పాతిక సంవత్సరాలే వయస్సయినా, అంతకన్న చిన్నదిగా కూడా కనిపిస్తుంది. చూడగానే ఆకర్షించగల కనుముక్కు తీరు. ఓపెన్ కాలర్లతో అందంగా కుట్టబడ్డగౌను వేసు కుంది. చక్కగా కత్తిరించబడ్డ జుట్టు, బలిష్ఠమైన ఆమెభుజాల మీద పడి, ఆమెకో కొత్త అందాన్ని ఇస్తోంది.

క్షణం గడిచింది.

స్ప్రింగ్ డోర్సు తెరువబడినయ్. ప్రొఫెసర్ బింద్సన్ ప్రవేశిం చాడు. మనిషి పొడగరి; దృఢంగావున్నాడు. అతను వేసిన ఫుల్ సూటునూ, హాటునూ, బూటునూ దూరంనుంచి చూసి, పాశ్చాత్యుడని మనం పొరబడ్డా, దగ్గరకురాగానే, దేశవాళీసరుకేనని అర్థమవక మానదు. అతని దుస్తుల రంగంతా నలుపే కావటం ఒక ప్రత్యేకతను సూచిస్తోంది. దీనికితోడు; నల్లటిగడ్డమూ, కళ్ళరూపును కప్పేసే నల్లఅద్దాలూ—అతని

కోలముఖాన్ని మహాగంభీరంగా తయారుచేసినయ్. పగటివేషం కాక పోయినా, చిన్నపిల్లలు భయపడతారనేందుకు సందేహంలేదు.

మేరీ:—(కూనిరాగంఆపి) గుడ్ మార్నింగ్— ప్రొఫెసర్ !

ప్రొఫె:—వెరీగుడ్ మార్నింగ్—మిస్ మేరీ !

[ ఫైల్సు తీసుకొని, మేరీ వెళ్ళిపోయింది. ప్రొఫెసర్ టోపీ కొంకెకు తగిలించి, సీలింగ్ ఫాన్ వొదిలి, రివాల్వింగ్ ఛైర్ లో కూర్చు న్నాడు. ]

ప్రొఫె:—[తనవెనుక ఏమిటో మరచిపోయి వొచ్చినట్టు, తలుపువైపు చూచి] రంగా! ఏమిట్రా నిలబడి పోయావ్! ...లోపలికిరా !

[ రంగారావు మెల్లిగా ప్రవేశించాడు. చిరిగినదుస్తులూ, వాడిన ముఖమూ, నిరాశనుసూచించే కళ్ళూ, చిక్కినశరీరమూ. పిచ్చివాడి వాల కానికి చాలాదగ్గర్లో వున్నాయ్. పెరిగినగడ్డం ఇందుకుతోడై, అతని బీదరికాన్ని ముందుగానే బైటపెడుతోంది. కొంచెం భయపడుతూ కుర్చీలో కూర్చున్నాడు. ]

ప్రొఫె:—ఇది నా ఆఫీసు. నువ్వేమీ సిగ్గుపడక్కర్లేదు; భయమేమీ లేదు.

రంగా:—ఎంత మారిపోయ్యావురా— హనుమంతరావ్రూ! మొదట్లో గుర్తుపట్టలేకపోయ్యాను. నీ గడ్డం నీ ముఖాన్ని పోల్చుకోలేకుండా చేసింది.

ప్రొఫె:—(కళ్ళజోడుతీసి టేబిల్ మీద పెట్టి) ఈ కాలంలో మారకపోతే లాభంలేదోయ్! ఇక గడ్డం అంటావా— లోకంలోని గొప్ప వాళ్ళల్లో చాలా మందికి గడ్డా

లున్నయ్. ఉదాహరణకు, జార్జ్ బెర్నార్డ్ షా, రవీంద్ర నాథ఼ఠాకూర్, లియోటాల్‌స్టాయ్ మొదలైనవాళ్ళు. ముందు గొప్పవాళ్ళయి వీళ్ళు గడ్డం పెంచారా, లేక గడ్డంపెంచి గొప్పవాళ్ళయ్యారా అనే విషయం వొదిలి, గడ్డమన్నా పెంచకుండా యీ ఆలోచనకు దిగకూడదనే నిర్ణయానికొచ్చాను. నా విషయంలో— మొదటి రెండూకూడా తప్పనే తెలుసుకున్నాను. ఎందుకంటే, నేను గడ్డం పెంచుతూ, పెంచుతూ గొప్పవాణ్నయి కూర్చున్నాను...

రంగా:—ఇంతకూ నీగొప్పతనం గడ్డంపెంచటంతోనే ఆగిపోయిందా?

ప్రొఫె:—(గడ్డాన్ని ప్రేమతో దువ్వి) అట్లా ఆగినట్టయితే- గడ్డం తీసిపారేసి, గడ్డంలేని గొప్పవాణ్నిగానే నిలబడిపొయ్యేవాణ్ని. గడ్డం దానంతట అదే ఎలా పెరుగుతోందో-మన గొప్పతనంకూడా దానంతట అదే అలా పెరుగుతూపోతోంది—

రంగా:—నీకు నువ్వే గొప్పవాడివనుకుంటూ—తృప్తి పడుతూన్నట్టుంది!

ప్రొఫె:—లేదు...ముందు మనలో మనకే నమ్మకంలేకుంటే. ఇతర్లు మనసు అసలే లెక్క చెయ్యరుకదా!

రంగా:—ఇంతకూ ఆగొప్పతనమేదో నన్ను కాస్తవిననివ్వు

ప్రొఫె:—విందువృకాని...అసలు నిన్ను ఆత్మహత్యకు పురిగొల్పిన కారణం ఏమిటో విననీ, అన్యాయంగా నా కారుకిందనే పడి, కారు టైర్లకిందినుంచే సరాసరి యీ పాటికి పరలోకాల్లోకి ప్రయాణం చేస్తుండే వాడివి— ప్రాణగండాన్ని దూసుకున్నావ్!

రంగా:—బతికినందుకు విచారిస్తున్నాను!

ప్రొఫె:—ప్రాణాన్ని అంతగా బాధపెట్టిన కారణాన్ని యీ ప్రాణస్నేహితుడు వినకూడదా?

రంగా:—వినేందుకు ఏముందీ? జీవితమంతా ఓయసెస్ లేని సహారాగా మారిపోయింది.

ప్రొఫె:—ఏదైనా ప్రేమవిషయమా?

రంగా:—కడుపులోచల్ల కదలనివాడికి ప్రేమకలాపాలు కాని, డొక్కలు కాలేవాడికి—?

ప్రొఫె:—ఓహో! ఇప్పటికి నీ ఆకలి తీరిందికదా?

రంగా:—సమయానికి నువ్వు కనిపించి, కాఫీహోటల్లో గొంతుదాకా పెట్టించాక కూడా ఆకలి తీరదా?

ప్రొఫె:—మొదట చూసినప్పుడే కొంతవరకూ గ్రహించాను. నువ్వుకూడా బాగా మారిపొయ్యావు మొదట చూడగానే, వీధులవెంట తిరిగే బిచ్చగాడనుకున్నాను!

రంగా:—నాకన్న వాడేనయం! చివరకు బిచ్చమెత్తుకునే కళన్నా నాకు అబ్బలేదు.

ప్రొఫె:—బి. ఎ. దాకా చదివావు. శాస్త్రోక్తంగా లోక జ్ఞానం వుంది. ఏదన్నా పని చేసేందుకు శరీరంలో బలం వుంది ఏదోవిధంగా పొట్టనన్నా గడవకనా యీపని చేసింది? ఆర్థిక హీనతకే హడిలిపోయి, ఆత్మహత్య చేసుకోవటంవల్ల ఏం లాభం?

రంగా:—లాభనష్టాల సంగతి అలావుంచి, అసలు బతుకు ఎందుకనే ప్రశ్నతో ఆనిర్ణయానికివొచ్చాను. భార్యనూ, ఇద్దరు బిడ్డల్నీకూడా పోషించలేకపోయ్యాక ఇక ఎవరి కోసం బతికేదీ? ఇంత భారమైన బతుకును ఆయాస పడుతూ యీడవటంకన్న—

ప్రొఫె:—అలా ఆలోచించి నిరాశపడకూడదు. నిజానికి నా సంగతిచూడు; వారాలు చేసుకొని బి. ఎ. దాకా చదివాను. నీకన్న ఎంతో హీనమైన స్థితిలో ఉండే వాణ్ని. అలాంటి నేను—ఇప్పటికొక లక్షరూపాయిలు సంపాయించాను...

రంగా:—అదృష్టవంతుడివి!

ప్రొఫె:—అదృష్టంమీద అంత పెద్దభారాన్ని వెయ్యకూ డదు. అదృష్టమనేది-మన కోరికప్రకారం, ప్రార్థించినా, కోపగించినా, ఏడ్చినా రాదు. అందుకని శాస్త్ర తెలివి తేటల్ని ఉపయోగించి, ఆ అదృష్టాన్ని జుట్టుపట్టుకొని మనదార్లోకి లాక్కురావాలి.

రంగా:—ఎట్లా?

ప్రొఫె:—(నవ్వి) కాసు సేపే—భయపడవొద్దు... నీకు కనీసం ఇంతదాక చెప్పిన ఊహల్లాటివన్నా తోచకపోవటం శోచనీయం. నేనైతే ఏదో ఒకటి చేసి జీవించేందుకు ప్రయత్నించే వాణ్ని.

రంగా:—అసలు నీ వ్యాపారం ఏమిటో నాకు అర్థమవలేదు.

ప్రొఫె:—ఇదొక రకం వ్యాపారమే! జీవితంలో నిరాశపడటం మూర్ఖ్యం! ఆ నిరాశలో, వున్న ఆశనుకూడా చంపుకుంటాం. ఏదో ఒక మార్గాన్ని ఆలోచించుకొనే అవకాశాన్నికూడా చేతులారా జారవిడుస్తాం. జాగ్రత్తగా ఆలోచిస్తే — అనేకమంది మనకన్న తక్కువ సౌఖ్యపడుతూ జీవిస్తున్నారు. కాళ్ళు లేనివాళ్ళూ, చేతులు లేనివాళ్ళూ, పశువంత విజ్ఞానమన్నా లేనివాళ్ళూ, చివరకు మొండాలుగా వుండికూడా అడుక్కుతినేవాళ్ళూ—వాళ్ళు అనుభవించే సౌఖ్యం ఏముందీ? వాళ్ళను చూసన్నా, వాళ్ళకన్న మనం అనేకరెట్లు నయమని ఊరట చెందవొచ్చు. నీలాంటి విజ్ఞానవంతుడు, బుర్రను సక్రమ మార్గంలో ఉపయోగించుకోక, అసలు బుర్రేవొద్దనే నిర్ణయానికి రావటం కన్నా బుద్ధితక్కువ లేదు. సంస్కారంవుండి లోకం పోకడను అర్థంచేసుకోగల మనం, ఇంత విశాల విశ్వంలో, ఏదో ఒక విద్యతో ఇతర్లను మోసంచేసన్నా బతకలేకపోం—

రంగా:—(ఆశ్చర్యంతో) మోసమా?

ప్రొఫె:—పచ్చి మోసం! ఆ సంగతి మన వాళ్ళకే తెలియాలి; ఎదుటివాడికి తెలుస్తే, అసలు మోసపొయ్యేవాడే దొరకడు. ఒక వేళ పొరపాటున దొరికినా, తనెల్లా మోసపొయ్యాడో, ఇతర్లనుకూడా అదే విధంగా మోసం చెయ్యటం మొదలు పెడతాడు. అంటే రోజు రోజుకూ, ఇదే వ్యాపారాన్ని సాగించేవాళ్ళ సంఖ్య అధికమౌతూంటుంది; పోటీకూడా పెరిగి పోతూంటుం దన్నమాట?

రంగా:—మోసం చెయ్యటం అంత తేలికా?

ప్రొఫె:—నీలాంటివాడు అడగాల్సిన ప్రశ్న కాదు చాలా తేలికంటే—ఆశ్చర్యపడ నక్కర్లేదు. మనకన్న బుద్ధి హీనులనేవాళ్ళు, యీలోకంలో, ఎప్పుడూ మనచుట్టూ ఉంటూనే వుంటారు. వాళ్ళను వెతికి పట్టుకోవటం ఒక్కటే శ్రమ. దాన్ని గడచామంటే, మిగతా మోస పోవటమనేదాన్ని వాళ్ళు తప్పించుకుపోలేరు...

రంగా:—ఐతే ఒకసారి అలా మోసపోతారేమో కాని—ఎప్పుడూనా? ఇవ్వాళ మోసపోయినవాడు, రేపు బుద్ధి మంతుడవడా?

ప్రొఫె:—నిజమే! ఇవ్వాల్టి బుద్ధిహీనుడు, రేపు బుద్ధిమంతు డైనా, నిన్నటి వాళ్ళను, ఇవాల్టి బుద్ధిహీనులుగా మనం తయారు చేసుకోవాలి. ఎడతెరిపి లేకుండా సాగిపొయ్యే

యీ మానవ ప్రవాహంలో బుద్ధిహీనుల కొరత ఎప్పుడూ ఏర్పడదు.

రంగా:—ఇక ఉపోద్ఘాతాన్ని ఆపి, అసలు సంగతికిరా—

ప్రొఫె:—వొస్తున్నాను. ఇదిచూడు.

[ప్రొఫెసర్ పత్రిక వొకదాన్ని అందించాడు. రంగారావు చదువుతున్నాడు]

రంగా: —అద్భుత వశీకరణం! కలియుగంలోని వింతల్లో పేర్కొనదగ్గది! పని చెయ్యలేదని రుజూచేసేవారికి ఐదువేల రూపాయిల బహుమానం!...మీరుకోరే స్త్రీ కానీ, పురుషుడు కానీ— ఎంత కఠిన హృదయులైనాసరే, ఇట్టే మీవశమై పోతారు. మీరంటే ఎంత అసహ్యించుకునే వ్యక్తయినా, మీపాదాల దగ్గర మోకరించక తప్పదు. డబ్బీవెల: రెండు రూపాయిలు మాత్రం. పోస్టేజి ప్రత్యేకం ఇతర వివరాలకు: ప్రొఫెసర్ బింద్సన్, కలకత్తా......యీ ప్రకటనను చాలా పత్రికల్లో చాలాసార్లు చూశాను. ప్రొఫెసర్ బింద్సన్ ఎవరూ?

ప్రొఫె:—నేనే!

రంగా:—పేరుకూడా మార్చుకున్నావా?

ప్రొఫె:—మొత్తం మనిషంతా మారుతూ, పాతపేరును మాత్రం ఎందుకు ఉంచుకోవాలి? ఆపేరుకు అర్థంలేకపోలేదు...విండ్ అంటే గాలి; సన్ అంటే పుత్రుడు...

వాయుపుత్రుడు హనుమంతుడు! తెలుగులో హనుమంత రావు అల్లా ఇంగ్లీషులో విండ్సన్ అవుతాడు. ఇది బెంగాల్ కనుక 'వ' అల్లా 'బ' అవుతుంది. అందుకని 'విండ్సన్' 'బిండ్స్నక్' అయింది.

రంగా:—పేరుచూస్తే ఏ యూరపియనో అనిపిస్తోంది—

ప్రొఫె:—ఔను. పేరులోకూడా వ్యాపార రహస్యంలోని కొంతభాగం ఇమిడిఉంది. ఆంధ్రులమధ్య పాతపేరుతో చలామణీ వుండదు. ఇక్కడ ఇంతదూరాన కూర్చుంటే, అసలు పేరుచదివితేనే, మూర్ఛబోయ్యే జనం బోలెడంత మంది......దూరపు కొండలు నునుపేగా!

రంగా:—ప్రొఫెసర్ వా?

ప్రొఫె:—నాగడ్డాన్ని చూసే ఆమాట గ్రహించవొచ్చు. ఒక శుభముహూర్తాన ఎవ్వరికీ తెలియకుండా, నాకు నేనే ప్రొఫెసర్నయ్యాను.

[ప్రొఫెసర్ కాలింగ్ బెల్ వాయించాడు. బైటినుంచి 'సార్!' అని జవాబు వొచ్చింది.]

ప్రొఫె:—మిస్ మేరీ! టపా రాలేదా?

మేరీ:—వొచ్చింది సార్—

[మేరీ వచ్చి టపా ఇచ్చింది]

ప్రొఫె:—బాయ్ ఏడీ?

మేరీ:—నిన్నటి పార్శిల్స్, తీసుకొని పోస్టాఫీసుకు వెళ్ళాడు—

[ఇంకేమన్నా అడుగుతాడేమోనని క్షణం నిలబడి, మరేమీ లేక పోవటంవల్ల, మేరీ వెళ్ళిపోయింది.]

రంగా:—ఈప్రకటనకే మోసపోయ్యే వాళ్ళుంటారా?

ప్రొఫె:—(ఉత్తరాలకట్టను అందిస్తూ) చూడు: యాభై, అరవై ఆర్డర్లున్నాయ్—

రంగా:—(చూచి) ఆశ్చర్యంగావుంది!

ప్రొఫె:—చూశావా? ఎంతమంది మూర్ఖులున్నారో! రోజూ ఇన్ని ఆర్డర్లూ వొస్తూంటయ్.

రంగా:—కాని, నీడబ్బీ ఏమన్నా పనిచేసేనా?

ప్రొఫె:—తప్పకుండా చేస్తుంది.

(కాళికా దేవి చిత్రపటంవైపు తిరిగి) రోజూ ఆ దేవికరుణ వల్ల, మంత్రబలంతోకూడిన—

రంగా:—రోజూ దేవీపూజ చేస్తుంటావా?

ప్రొఫె:—ఆఁ రోజూ 'దేవీ! యీ మూర్ఖుల్ని విడవకుండా నాదగ్గరకి తోలు' అని ప్రార్థిస్తూంటాను...ఇదిగో డబ్బీ!

[డ్రాయరు సొరుగులోనుంచి డబ్బీ తీసిఇచ్చాడు]

రంగా:—(డబ్బీతీసిచూసి) ఇంత చిన్నడబ్బీలో— ఏంకలిపావూ?

ప్రొఫె:—వాసులైనూ, గంధంపొడీ, తుమ్ముబంకాను—

రంగా:—తుమ్ముబంకా?

ప్రొఫె:—ఔను...బాగా అతికేందుకు!

రంగా:—నాకు అర్థంకావటంలేదు,

ప్రొఫె: —చెప్తాను. వ్యసనాలు లోకంలో అనేకరకాలు, అందులోనూ సెక్స్‌వ్యసనం మరీఘోరం. ప్రతివాడికీ, ఏదో వొక సందర్భంలోనన్నా ఇది పట్టుకోకమానదు ప్రేమా, మోహమూ, కామమూ ఇవన్నీ దాదాపు ఒకేజాతిలోవి. ఇక, శ్రమయేమీ లేకుండా, రిస్కు యేమీ చెయ్యకుండానే, కాలయాపన కాకుండా, తను కోరేవ్యక్తిని ఇట్టే తనవశం చేస్తామంటే—రెండురూపాయి లున్న ప్రతివాడూ, టెంప్టవక మానడు! పనిచేస్తే రెండురూపాయిలుఖర్చూ, లేకుంటే ఐదువేలుబహుమా నం! ఎంతగ్యారంటీ! మనమందును ఉపయోగించాలే కాని, పనిచెయ్యకపోవటం వుండదు—మనం సూచించే ప్రకారం, యీ అంజనాన్ని తను కోరేవ్యక్తి కంఠానికి కిందిభాగంలో రాయాలి—

రంగా:—రాస్తాడనుకో—

ప్రొఫె:—వీడితరమా? వీడితాత తరమా? ఆవ్యక్తికీ, తనకూ అంత దగ్గరిసంబంధం ఉండొద్దూ? ఒకవేళ అది నిజంగా ఉండాలేకాని, యీ అంజనంలేకుండానే ఆవ్యక్తి వీడి వశమవకమానదు. నిజానికి ఇది చేసేది యేమీలేదు. అలా వశంకాగానే, అంతా యీ అంజనం మహాత్మ్యమేనని వాడు పొరబడతాడు ... అసలు రాచేందుకు పిరికిపడి, మానేసేవాళ్ళు సగానికి పైగావుంటారు—

రంగా:—ఎందుకని ?

ప్రొఫె:—వాడిలో వాడికి నమ్మకంలేక, మనదగ్గర యీ నమ్మకపు డబ్బీని రెండురూపాయిలిచ్చి కొనుక్కున్నాడు. చూస్తూ చూస్తూ ఆ నమ్మకాన్ని విసిరిపారెయ్యలేడు—డబ్బుకు కొనుక్కున్నదాయె మరి! సైకిక్ ఎఫెక్ట్ అనేది ఎంతపనన్నా చేయిస్తుంది. వాడు ఆ నమ్మకంతో సముద్రంలోకూడా దూకుతాడు. ఇది అతి రహస్యమైన, వ్యక్తిగతవ్యవహారం కనుక, ఇతరులకు—చివరకు తన ప్రాణమిత్రులకుకూడా చెప్పడు అంటే ఇతరు లెవరూ, వీడికి మాటలుచెప్పి నిరుత్సాహపరచరన్న మాట!

రంగా:—ఆ ఉత్సాహంలో వాడు అంతపనీ చేసికూడా—

ప్రొఫె:—ఆగు! నన్ను చెప్పనీ! నీకు అర్థంకాలేదని నా భయం. ఇది ఉపయోగించేపాటి అవకాశం దొరకటం కష్టం. ఒకవేళ దొరికినా, ఆ సమయానికి పిరికిపడి పోతాడు. ఈ డబ్బీ తెప్పించేవాడు—అసలే వొట్టి పిరికి వెధవన్నమాట. తన అసమర్థతను, యీ డబ్బీ సమరతతో కప్పిపుచ్చేందుకు ప్రయత్నిస్తున్నాడన్నమాట! ఒకవేళ మొండిధైర్యంచేసి ఉపయోగించాడే అనుకుందాం! అంతదూరం వచ్చాక వాళ్ళపరిచయం చానంతట అదే ప్రేమగానో, మోహంగానో మారిపోతుంది—

రంగా:—ఒకవేళ ఎదురుతిరుగు తే—?

ప్రొఫె:—(నవ్వి) సరే ఎదురుతిరిగిందయ్యా — ఏమిటివ్యక్తికి అసలేమీ ఇష్టంలేదనుకుందాం. ఇందులో తుమ్మబంక కూడా ఉండడంవల్ల చీదరగాకూడా వుంటుంది కనుక, ?ాగి చెంపమీద ఒక్కటన్నా పడకమానదు. ఆ దెబ్బతో గిద్దెడు మిరియాలు రాలి, మనవాడికి దేవేంద్ర లోకం కనిపించకమానదు. ఇక యీ జన్మకు మళ్ళీ ఆ ప్రాంతాలకు పోనేపోడు—

రంగా:—మరి బహుమానమో ?

ప్రొఫె:—ఏడిశాడు. అబ్బాయీ! ఎవరి అవమానాన్ని వాళ్లు చెప్పుకోరు. ప్రియురాలిదగ్గర ఐదువేళ్లూ తేలేట్టు చెంప దెబ్బతిని, వేడినీళ్ళకాపు కాచుకోవటం కాక, సిగ్గు లేక — ఇంకెవరితో చెప్పుకుంటాడూ? ఆశృంగ భంగాన్ని విని అందరూ ఎగతాళిగా నవ్వుతారే కాని, ఎవ్వరూ జాలిపడరుకూడాను! ఒకవేళ, మొండివెధవ ఎవడన్నా మన దగ్గరకు వొచ్చినా, 'అబ్బాయీ! నువ్వు చెప్పేది నేను నమ్మను' అని ఇంకో డబ్బీ ఇచ్చి మళ్ళీ ప్రయత్నించి రుజూచెయ్య మంటాను. నాకు రుజూచెయ్యాలంటే, యీ కొవ్వును ఆ ప్రియురాలికే నా కళ్ళ ఎదుట రాయాలి. లోగడ ఒకచెంప వాయగొట్టనేవాయగొట్టింది, ఇప్పుడు రెండో దానికో, లేక రెండింటికో యీ నిర్భాగ్యుడు సిద్ధమవ్వాలి! అదీకాక, మొదటిసారిలాగ కాకుండా, అపరిచిత వ్యక్తిని నే నొకణ్ని దృశ్యంలో

వుంటానాయె! పరాయిమనిషి చూస్తుండగా, ఇలాటి పని చేసేవాణ్ని, అభిమానంగల ఏ ఆడదీ ఊరుకోదు. ఇలాటి 'సర్కస్'కు ఎవ్వడూ మళ్ళీ పూనుకోడు—తెలిసిందా ?

రంగా:—ఇంత మూఢులున్నారా ?

ప్రొఫె:—లేకేం ? రెండో కంటికి తెలియకుండా ఆర్డరు పెడతారు. మన వి. పి. కోసం రెండు రోజులు ముందు నుంచే పోస్టాఫీసులో కాపలాకూర్చుంటారు. ఎవరైనా చూసి, ఏమిటని అడుగుతే—ఇదంతా చెప్పాల్సివొస్తుందని, ఎవరికంటాపడకుండా తీసుకుపోతారు. మనమందు పనిచెయ్యకపోతే ఎవరికీ చెప్పుకోరు కాని, పనిచేస్తే మాత్రం ఇంకా ఇతరస్నేహితులకూ్కడా సిఫారసు చేస్తారు. అసలు ఎక్కువగా మనతోపీపడేది కాలేజీ స్టూడెంట్సు. వాళ్ళప్రేమ వ్యవహారం ఏక్లాసుమేటుతోనో ఐవుంటుంది. మానవ హృదయం–సామాన్యంగా–తనకన్న అన్నివిధాలా అధికంగా ఉండేవ్యక్తినే ప్రేమిస్తుంది; తన కన్న అందగత్తా, కులీనా, సంస్కారం కలదీ, ధనవంతురాలూ ఐనదాన్నే ప్రేమిస్తూంటాడు. కొంతసరుకు ఇక్కడపెట్టి ఏరుకోమంటే—అన్నింటికన్నా మాంచి దాన్నే ఏరుకోవటంలో అసహజమేమీలేదు. ఇక ఆ యువతితో మాట్లాడేందుకే అయ్యగారికి కాళ్ళు ఒణుకుతూంటాయ్; ఎందుకంటే ఆమె తనకన్న అధికురాలే

న నే అభిప్రాయం కలిగించే పిరికితనం లోపల పనిచేస్తూనే ఉంటుంది కనుక !

'రంగా:—ఒక వేళ నిద్రలో రాస్తే?

ప్రొఫె:—ఏడిసాడు! రాత్రిసమయంలో నిద్రపొయ్యేప్పుడు, దొంగతనంగా ఇంట్లో ప్రవేశించి, అంతపనిచేసేందుకు. గుండా? చెరువా? వీపుకు ఇన్సూర్ చేసుకున్నావుండాలి, లేకుంటే లోహంపుకవచమన్నా వేసుకోవాలి. ఏమైనా—ఒక వేళ ఇదేమన్నా ప్రమాదమేమోనని ముందుగానే ఆలోచించి, నిద్రవేళ యీమందు పని చెయ్యదన్నాను. ఎందుకంటే, నిద్ర మృత్యువుతో సమానం కనుక! ఒకసారి ఉపయోగార్థం తీసినమందు, ఒక గంటగడిచాక మళ్ళీ పనికిరాదన్నాను. ఇందువల్ల, ఐదారుసార్లు ఫెయిలవుతూ, మన డబ్బీలు ఐదారు కొన్న వాళ్ళూ వున్నారు. జన్మలో తాము యీపని చెయ్యలేరనే మాట, వాళ్ళు గ్రహించరు—ఇందులో మందు కూడా ఒక్కసారి కన్నా రాదు.

రంగా:—అదంతా అల్లావుంచు; ఒక వేళ ప్రభుత్వమే యీ మోసాన్ని పట్టుకుంటే?

ప్రొఫె:— ఇది మోసమని ప్రభుత్వాని కెల్లా తెలుస్తుందీ? అవమానంతోనూ, శృంగభంగంతోనూ చచ్చేవాడు—ఎవడూ మొరపెట్టుకుంటాడూ? ప్రభుత్వానికి మనమేంచేస్తున్నామో చూడటం కన్నా ఇంకో పనిలేదా? ఎదురు మాటలేకుండా ఇప్పటికో లక్ష సంపాయించాను!

రంగా:—నువ్వు ఎంత సమర్థుడివి!

ప్రొఫె:—ఇందులోని రహస్యం తెలిశాక. అందరూ సమర్థులే అవుతారు. నా యీ జీవితరహస్యాన్ని వినేందుకు నువ్వే మొదటివాడివి. నీ అంతట నీకు ఇలాటి మార్గం తోచలేదు కనుక, ఇతర్లను చూసన్నా నేర్చుకోక తప్పదు. అంటే, నన్నుచూచి నువ్వుకూడ — నాలాగే వేరే ఇంకో కంపెనీ స్థాపించి సంపాయించు—

రంగా:—నేనా?

ప్రొఫె:—ఔను! నీకేం భయంలేదు. కాని ఒక్కటిమాత్రం గుర్తుంచుకో, ఈ రహస్యాన్ని, ఎవ్వరికీ, చివరకు నీ భార్యకుక్కూడా, కలలోనన్నా చెప్పవొద్దు రహస్యం వెల్లడైనకొద్దీ వ్యాపారం క్షీణించటమే కాకుండా, వీపు చెడటంకూడా తటస్థపడొచ్చు... తస్మాత్... జాగ్రత?

[రంగారావు ఆలోచనలో పడ్డాడు]

ప్రొఫె:—ఏమిటీ—ఆలోచిస్తున్నావ్?

రంగా:—ఇలాటిది నా చేత కాదు.

ప్రొఫె:—భయమా?

రంగా:—నామనస్సు ఒప్పటంలేదు.

ప్రొఫె:—ఒప్పేదేమిటీ నీ మొహం? న్యాయంగా చిల్లిగవ్వన్నా సంపాయించలేవు. ఇది మోసమేఐనా—

రంగా:—ఇది ఇతర్లను మోసగించటంగా నాకుతోచటం లేదు, మన ఆత్మను మనమే వంచిస్తున్నామేమోనని—

ప్రొఫె:—మొదట్లో నాకూ అల్లాగేఅనిపించింది. ఇతర్లను మోసంచేసేముందు, మన అంతరాత్మను మనమే మోసంచేసుకోవాలి. అది తిరగబడుతూ వుంటుంది. అంతకన్న ఎక్కువబలంతో దాని గొంతు నొక్కి పారెయ్యాలి. అప్పుడు అసలు మోసమంటే ఏమిటో, పట్టుబడకుండా దాన్ని ఎలా ఆచరణలో పెట్టగలమో అర్థమౌతుంది. అదే పద్ధతిలో ఇతరులను—

[మిస్ మేరీ వొచ్చేస్పటికి ప్రొఫెసర్ చెప్పటం ఆపేశాడు.]

మేరీ:—ఎవరో యువకుడు మిమ్మల్ని చూడాలంటున్నాడు సార్ ! అరగంటనుంచీ వేచి కూర్చున్నాడు.

ప్రొఫె:—సరే...పంపు

[మేరీ వెళ్ళిపోయింది.]

ప్రొఫె:—ఎవడోనిర్భాగ్యుడు డబ్బికోసం వొచ్చినట్టున్నాడు !

[యువకుడు వొచ్చాడు. వయస్సు ఇరవైరెండువుంటుంది]

ప్రొఫె:—కూర్చోండి...

[యువకుడు కూర్చొని, విజిటింగ్ కార్డు ఇచ్చాడు కాని, చెప్పేందుకు భయపడుతూన్నట్టు ఊరుకున్నాడు]

ప్రొఫె:—మరేం భయంలేదు, ఆయన మా అసిస్టెంటు... చెప్పండి—

యువ:—మొన్న నేను మీదగ్గర ఒకడబ్బీ తెప్పించాను—

ప్రొఫె:—ఔను...

యువ:—అది పనిచెయ్యలేదు సార్ !

ప్రొఫె—అసంభవం! దేవి పూజాబలంతో శుద్ధిఅయ్యాక-అటుసూర్యుడు ఇటుపొడవాల్సిందేకాని, పనిచెయ్యక పోవటమంటూ వుండదు! ఇలాంటిది మీదే మొట్ట మొదటి కంప్లెయింట్...నేనుచెప్పిన డైరక్షన్స్ ప్రకారం నడిచారా?

యువ:—'తు' 'చ' తప్పకుండా అనుసరించాను సార్.

ప్రొఫె:—ప్రేమించిన వ్యక్తి కంఠం కిందిభాగంలో బాగా రాచారా?

యువ:—బాగా ఏమిటీ–పులిమేశాను!

ప్రొఫె:—ఏమైందీ?

యువ:—చెంప ఛెళ్ళుమంది సార్!

ప్రొఫె:—(నవ్వి) ఆ అట్లాగా? నిద్రలో కాదుకదా?

యువ:—నిద్రకాదండీ; పట్టపగలు ఎదురుగా నిలబడి ఆ పని చేశాను.

ప్రొఫె:—(విసుగ్గా) ఇప్పుడు మీ రేమంటారూ?

యువ:—అదిపని చెయ్యకపోతే, మీరు ఇస్తామన్న బహుమానం ఐదువేలు.

ప్రొఫె:—అదెల్లా? మీరు నాకు రుజూచేసేవరకూ నమ్మలేను ఇదిగో! ఇంకోడబ్బీ ఇస్తున్నాను. నా ఎదుట మీరు

దీన్ని ఉపయోగించాలి. అప్పుడది పనిచెయ్యక పోతే ఐదు వేలరూపాయలూ మీకు ఇచ్చేందుకు నా కేమీ అభ్యంతరం లేదు.

యువ:—అలాగే సార్...ఇప్పుడే ఉపయోగిస్తాను.

ప్రొఫె:—ఇప్పుడా? మీరు ప్రేమించిన వ్యక్తిని ఇక్కడికి తీసుకొచ్చారా యేం?

యువ:—ఔను...బైటకూర్చో పెట్టాను. ఇప్పుడే పిలుచు కొని వొస్తాను.

[ యువకుడు వెళ్ళి పోయ్యాడు ]

రంగా:—ఇప్పుడు ఏమౌతుందీ?

ప్రొఫె:—మరేం ఫర్వాలేదు, వీడు ప్రేమించిన ఆడది, వీడితో ఇంతదూరమూ రావటమే, వీళ్ళ మధ్యవున్న పరిచయాన్ని చాటుతోంది. ఇంతదూరం వొచ్చాక, ఇంకెంత దూరమన్నా రాక మానదు. మన ఇద్దరి ఎదుటా, ఆ అంజనాన్ని ఆమె రాయించు కోవాలి కదా?

[ యువకుడు ఇంకో యువకుడితో ప్రవేశించాడు. రెండో వాణ్ణి స్థూలకాయుడనటం సమంజసం ]

యువ:—వీడిపేరు సురేష్: వీణ్ణేనండీ నేను ప్రేమించింది!

ప్రొఫె:—ఏమిటీ! మొగవాణ్ణా?

యువ:—ఔను...మా క్లాసులో ఆడపిల్లలు లేరు. మొత్తం కాలేజీలో ఐదారుగురు వున్నారు కాని, వాళ్ళజోలికి పోవటం నాకంత క్షేమకరంగా తోచలేదు. మా క్లాసులో వీడు ఎప్పుడూ నాపక్కనే, నన్ను రాచుకుంటూ కూర్చుంటూంటాడు. క్రమంగా వీడి ప్రేమలో తల క్రిందులుగా పడిపోక తప్పలేదు. బోలెడు ప్రణయ కవిత్వం రాసీ వీడి మొహాన విసిరి పారేశాను. కాని వీడికి నా మీద దయ కలుగలేదు. చివరకు నిరాశ పడ్డాను......అప్పుడు పత్రికలో మీ ప్రకటన కనిపించింది. వెంటనే ఒక డబ్బీ తెప్పించి, నిండు క్లాసులో వీడికి పట్టించాను. కళ్ళు జిగేలు మనేట్లు చెంప దెబ్బ కొట్టాడు. లేచి చూసేప్పటికి గ్యాలరీ మెట్లన్నీ దాటి కిందపడి వున్నాను. ఈ న్యూసెన్సుకు ప్రిన్సిపాల్—మా ఇద్దర్నీ మూడురోజులు సస్పెండ్ కూడా చేశాడు.

ప్రొఫె:—మీరు ఆడవాళ్ళమీద ప్రయోగించాలి—

యువ:—అది నా ఇష్టం. అందరి ప్రకృతీ ఒకేరకంగా వుంటుందా మరి? ప్రేమకు జాతి, మత విచక్షణ ఉండదని అందరికీ తెలుసు...మీరు మీ ప్రకటనలో—'మీరు ప్రేమించింది ఎవరైనా సరే, పురుషుడైనా, స్త్రీఐనా, ఎంతకఠిన హృదయులైనా సరే...' అన్నారు. అంటే పురుషులు పురుషుల్ని ప్రేమించటంకూడా సంభవమేనని

మీరు ఆలోచించే ప్రకటన ఆవిధంగా చేశారనేది స్పష్టంగా తెలుస్తూనేవుంది...సరే ఇప్పుడే, మీ ఎదుట మీ అంజనం మా ప్యారీకి పట్టిస్తున్నాను. కాని, వీడు కాస్త బలశాలి కనుక, తిరగబడతాడనే భయంవుంది ఐనా, మిమ్మల్ని నమ్మి—

[యువకుడు అంజనాన్ని పట్టించాడు. చిరాకుగా తుడుచుకుంటూ, సురేష్—యువకుణ్ని కొట్టబొయ్యాడు. యువకుడు పరుగెత్తుకుంటూ వొచ్చి ప్రొఫెసర్ వెనకాల దాక్కున్నాడు]

ప్రొఫె:—(కోపంతో) ఏమిటిదీ ?

యువ:—మీ అంజన ప్రభావం—మీరేచూశారుగా !

[ ప్రొఫెసర్‌కు నోటమాటరాలేదు ]

యువ:—రుజూఐపోయింది కనుక మీరన్న బహుమానం ఐదు వేలూ ఇటివ్వండి...

ప్రొఫె:—ఇది చాలా అన్యాయంసార్ !

యువ:—న్యాయం జరుగుతుందో లేదో ననే భయపడి, పోలీసుఆఫీసర్ను కూడా వెంట పెట్టుకొచ్చాం. దారిలో కాస్త మందు పుచ్చుకోవటంవల్ల, బేవార్సుగా వొచ్చిం దికదా నని డోసు అధికంగా పడడంమూలాన—వారు బైట కుర్చీలో నిషాలో కునికిపాట్లు పడుతున్నారు... న్యాయాన్ని ఇచ్చేందుకు, వారు ఎప్పుడూ సిద్ధంగానే వుంటారుకూడాను !

ప్రొఫె:—(కోపంతో) నాఆఫీసుకు పోలీసు లెందుకూ ?

యువ:—మీరు పెద్దమనుషులై, వ్యవహారాన్ని ఫైసల్ చేస్తే, వాళ్ళుకానీ, మేముకానీ గలభా లేకుండానే వెళ్ళి పోతాం.

[ప్రొఫెసర్ క్షణం ఆలోచించి. నిర్ణయించుకున్నవాడల్లే, ఐదు వేలకు చెక్ రాసి యిచ్చాడు]

యువ:—(చెక్ తీసుకొని)థాంక్యూ సార్ ...గుడ్ మార్నింగ్!

[యువకుడూ సురేష్షూ వెళ్ళిపొయ్యారు]

ప్రొఫె:—ఫూల్స్! ఇడియట్స్!

రంగా:—అంత తేలిగ్గా పైకం యిచ్చేశావేం ?

ప్రొఫె:—ఏం చెయ్యమంటావ్ ? బైట పోలీసువాడుండె. నా కసలు బెంగాలీపోలీసులంటే మహాభయం! వీళ్లుచూడ బోతే గడుగ్గాయిల్లా గున్నారు. ఇప్పుడేమన్నా గడిబిడి జరుగుతే, ఇక్కడ పోగైనవాళ్ళకు ఈ మోసం కాస్తా తెలిసి పోతుంది. ఇకముందు మరి వ్యాపారం సాగదు. ఒకడికి తెలియకుండా, వాడి పక్కవాడికి టోపీవెయ్యాల్సిన వ్యాపారం కనుక ఎంత తక్కువ మందిదగ్గర దీన్ని వొదిలించుకుంటామో-మనకంత తేలిక ! మొండి కేసి రేపు కోర్టుకువెళ్తే, మరికొంత శ్రమా, ఖర్చూనూ, కోర్టులోకూడా నామందు పని చెయ్యలేదని వీడు రుజూచేస్తాడు అక్కడైనా నేను యీ

డబ్బు కక్కాల్సిందే! ఇదంతా వార్తా పత్రికల ద్వారా వెల్లడైతే, వ్యాపారం సాగే అవకాశం ఇంకేమీ ఉండదు—

రంగా:—ఇంకా వ్యాపారంసంగతే ఆలోచిస్తున్నావా? నువ్వు సంపాదించిన లక్షరూపాయలూ, రెండు రెండుగా సంపాయిస్తే, ఫాయ్యేప్పుడు, దెబ్బకు ఐదేసివేలచొప్పున, ఇరవై సార్లలో ఖాళీ! వీళ్ళు నీకన్న తెలివిగలవాళ్ళు. రేపు ఇంకోడబ్బీ తెప్పిస్తారు. మళ్ళీ ఇదే నాటకం! ఇక నుంచీ, ఆడది ఆడదాన్నీ, మొగాడు మొగాణ్నీ ప్రేమించటం మొదలుపెట్టి, కొద్దిరోజుల్లోనే నిన్ను ఇక్కణ్నుంచి, వేళ్ళతోసహా పీకిపారేస్తారు! నువ్వు ఎంత తేలిగ్గా సంపాయించావో, అంతకన్నా తేలిగ్గా పోగొట్టుకుంటావ్!

ప్రొఫె:—ఇదీ ఆలోచించాల్సిన విషయమే!

రంగా:—నీకూ, నీవ్యాపారానికీ ఒకసలాం - నేనుపోతున్నాను-

ప్రొఫె:—ఎక్కడికీ? వ్యాపారం చేసేందుకా?

రంగా:—(నవ్వి) వ్యా...పా...రం! దౌర్భాగ్య బానిస దేశంలో—ఒక బానిస ఇంకోడికన్న తెలివిగలవాడైనంత మాత్రాన-అందరినెత్తినా చేతులుపెట్టే అధికారాన్ని తీసుకోవటం దుర్మార్గం! నేను పుట్టింది ఇందుకేనా ఇంతకన్న ఘనకార్యాన్ని చెయ్యలేనా?

ప్రొఫె:—ఇంతసేపూ సకారణంగా నూరిపోసినా నీకు నచ్చలా? (విసుగ్గా) ఇంకో ఘనకార్యం! పోయి—చావు!

రంగా:—ఔను.. మృత్యువుకన్న యీవ్యాపారమే భయంకరంగా వుంది! మానవ దౌర్బల్యాన్ని రూపుమాపుకోవాల్సిన ప్రజలకు ఆదౌర్బల్యాన్ని అధికం చేసేవిజ్ఞానాన్ని ఇవ్వటం - అబ్బ! అంతరాత్మ క్షోభను వినలేను! చావటమే న్యాయంగానూ, ఉచితంగానూ తోస్తోంది!

[రంగారావు త్వరత్వరగా వెళ్లిపొయ్యాడు]

ప్రొఫె:—(నిలబడి, వికటంగా నవ్వుతూ) నిప్ప్రయోజకుడు! పిరికిపంద! (క్షణంఆగి) మిస్ మేరీ!

[సార్, అని జవాబు వొచ్చింది. క్షణం గడిచేప్పటికి, చేతిలో నోట్ బుక్ తో, మిస్ మేరీ వొచ్చింది]

ప్రొఫె:—పత్రికలన్నింటిలోనూ మన ప్రకటనను ఆపెయ్యమని టెలిగ్రాములివ్వు—

మేరీ:—అదేమిటిసార్ - మన వ్యాపారం?

ప్రొఫె:—ఇప్పటికి సంపాయించింది చాలు...వ్యాపారాన్ని ఆపేశాం!

మేరీ:—(ఏడుస్తూ) మరి నా ఉద్యోగం సార్?

ప్రొఫె:—దిగులుపడవోక ఈ ఉద్యోగం పోయినా ఇంకో ఉద్యోగం ఇస్తాను—

మేరీ:—ఇంకో ఉద్యోగం యేమిటిసార్?

ప్రొఫె:—విను మేరీ! రెండేండ్లక్రితం యీ లేడీ టైపిస్టు ఉద్యోగంకోసం ఎంతమంది, యంగ్ అండ్ బ్యూటిఫుల్ గరల్స్ నాదగ్గరకు వచ్చారో నీకు తెలుసు... వాళ్ళందరిలోకీ నిన్నే ఎందుకు ఏరుకున్నానో తెలుసా?

మేరీ:—మీరు ఎవర్నో వొకర్ని ఏరుకోవాలి; ప్రమాదవశాత్తూ నన్ను ఏరుకొని వుంటారు...

ప్రొఫె:—చాలాపొరబడ్డావ్! అది కాదు—నీమాటలధోరణీ, నీ ఉత్సాహము, అన్నిటికన్నా నీ అందమూచూసి నీ కే యీ ఉద్యోగాన్ని ఇచ్చాను...

మేరీ:—నా పనితన మో?

ప్రొఫె:—బోడిపని! ఒకర్ణ్ణీ కూర్చొని టైపుచేసుకున్నా చేసుకోవొచ్చు ... నిన్ను ఆ మొదటిసారి ఇంటర్‌వ్యూలో చూసినప్పుడే, నా హృదయంలో ప్రత్యేకంగా నీకొక గదిని ఏర్పాటుచేసి, ఆ నాటినుంచీ— నిన్ను దేవతలాగు పూజిస్తున్నాను!

మేరీ:—ఈ సంగతి నా ఉద్యోగం ఐపొయ్యాక నా చెప్పటం?

ప్రొఫె:—వెధవ ఉద్యోగం! కోమలమైన నీ వేళ్ళు — అ టైపు రైటరు ఇనప 'కీ' లమీద ఆడుతూంటే, నా హృదయవీణతీగెలు విజృంభించి భయంకరంగా మోగేవి, అప్పుడు నా హృదయంతరాళంలోని తుపాను— (కళ్ళుమూసి)...... కాదు భూకంపం ...... అహా!

మేరీ:—కవిత్వం మాట్లాడుతున్నారు!

ప్రొఫె:—నీ మీద కవిత్వంకూడా కట్టాను...విను!

(గేయం) ఓహో! మేరీ!

మేరా ప్యారీ!

My dear Miss
Let us Kiss

[ తన్మయత్వంతో మేరీని ఘుమిపిస్తున్నాడు ]

మేరీ:—ఉస్...బస్...బస్! ఆగండి సార్...మీది మీదికి రావొద్దు—

ప్రొఫె:—మన ప్రణయగాథ ఇంతదూరం నొచ్చాక ఇంకా ఆగటమేమిటీ! నిన్ను మనసారా ఎంతగా ప్రేమిస్తున్నానో—

(గడ్డందువ్వి) నా యీ గడ్డానికే తెలుసు!...మనిద్దరమూ వివాహమాడుతేనేకాని నా యీ మంటలు చల్లారవు! డియర్ — నువ్వు నా కిక పైపిస్టువు కావు, నాలోని కీలనుకదిల్చే మధురమూర్తివి! అంటే నాకు గృహిణివిగావుండటమే—నీకొత్త ఉద్యోగం!

[ మేరీని కౌగలించుకోబోయ్యాడు. మేరీ పక్కకు జరిగి— ]

మేరీ:—తొందరపడకండి సార్—

ప్రొఫె:—తొందరపడకుండా, రెండు సంవత్సరాలు వృథా చేశాను—

మేరీ:—మొగశరీరం తాకుతే నా కసలు చీదర - చీదర సార్! మొగాళ్ళను నేనసలు ప్రేమించలేను.

ప్రొఫె:—ఫూల్! ఇందాకటి కాలేజీకుర్రాళ్లకు పట్టిన దెయ్యమే నీకూ పట్టినట్టుంది! వాళ్ళు మొగాళ్ళూ మొగాళ్ళూ ప్రేమించుకుంటే, ఆడదానివైన నువ్వు మొగాళ్ళనే ప్రేమించవూ? చెట్లనూ చేమల్నీ ప్రేమిస్తావా? ...

(నవ్వి) ప్రేమ! ... ఉండు—నా అంజనం పట్టిస్తేకాని నీలోని ప్రేమ ప్రవాహం కట్టలు తెంచుకొని బైటికి ఉరకదు.

మేరీ:—ఆ ప్రవాహంలో మీరు కొట్టుకు పోతారు ... ఆగండి ... నేను చెప్పేది వినండి—మీ అంజనం నా మీద పని చెయ్యదు—ఎందుకంటే నేను... నేను... ఆడ వేషంలో వున్న మొగ పురుగును!

ప్రొఫె:—(ఎగిరి గంతేసి) ఆ ం. ఏమన్నావ్? మొగవాడివా? నా ప్రేమ యీ హిమాలయా శిఖరాలు ఎక్కేదాకా ఆసంగతి నా కెందుకు చెప్పలేదూ?

మేరీ:—చెప్తే ఉద్యోగం పోతుందని చెప్పలేదు. ఎంత తెలివి తేటలూ, సమర్థతా, పని తనమూ వున్నా, మూతిమీదిమీసం దాన్ని కప్పి పెట్టే కాలంలో— ఘోరం

చెయ్యమంటారూ? ప్రతి ఆఫీసుకూ లేడీ టైపిస్టు కావాలికాని— మొగాడి మొహం చూసే వాళ్ళే లేరాయె! చదువు సంధ్యలు ఎంత వరకూ ఉపయో గించినా, పూర్వం కాలేజీనాటకాల్లో వేసే ఆడవేషం చివరకు ఉపయోగ పడ్డది...

ప్రొఫె:—(కూలబడి) డామిట్!,.. మోసం!

మేరీ:—లోకమే మోసం సార్! మీరు ప్రజల్ని మోసం చేస్తున్నారు! నేనూ మరికొందరూ మిమ్మల్ని మోసం చేస్తున్నాం... మోసం చేసేవాడు కూడా, మోసపోక తప్పదు...ఇంక వొస్తాను సార్...గుడ్ బై...

ప్రొఫె:—ఎక్కడికి వెళ్లావూ?

మేరీ:—ఇంకో అఫీసులో లేడీటైపిస్టు ఉద్యోగానికి

[వెళ్లిపోతోంది]

ప్రొఫె:—నువ్వు! ...లేడీటైపిస్టు! ...హ్హా...హ్హా...హ్హా!

[తెర]

—జూలై, 1946

# చికిత్స

శుభ్రమైన గది. ఒక పందిరిమంచమూ, రెండుకుర్చీలూ ఉన్నవి. టేబిల్ మీద బిగ్ బెన్ గడియారమూ, అంతకుముందే కోసిన పువ్వులతో అమర్చబడ్డ ఫ్లవర్ పాటూ ఉన్నవి. టేబిల్ కు పక్కగావున్న బుక్-షెల్ఫ్ లో విలువైన పుస్తకాలు కంటికి ఇంపుగా సర్దబడినయ్. నేలమీద విలువైన తివాసీ పరచబడివుంది. పైన సీలింగ్ ఫాన్ తిరుగుతూవుంది. ఎలట్రిక్ డూంలైటూ, ఒకపక్కన రేడియోవుంది. రేడియోమోత యీ గదిలోని నిశ్శబ్దతను భంగపరచటంలేదు. ఆకారాన్ని పట్టి ఇది ఐశ్వర్యవంతుల గృహమై ఉంటుందని గ్రహించవచ్చు.

గడియారం ఇప్పుడే పదిగంటలు దాటుతోంది. పైనిఎలట్రిక్ లైట్ వెలగకపోయినా, మనకు అంతా కనిపిస్తూండటంవల్ల, ఇది పగలై వుంటుంది.

పందిరిమంచంమీద, మెత్తని పరుపులమధ్య ఇందిరాదేవి హాయిగా పడుకొని చదువుకుంటోంది. ఆమె వయస్సు పాతికేళ్ళు. చక్కనిముఖమూ ముఖానికి అందాన్నివ్వగల విశాల ఫాలభాగమూ, విజ్ఞానంతో మెరిసే పెద్దకళ్ళూ-ఒక్కమాటలో-ఆధునిక విజ్ఞాన సుందరి - అందాం. ఆమె ముఖంలోని లోపమల్లా ఒక్కటే—కుంకుమబొట్టు లేదు !

ఒక్కక్షణం నిశ్శబ్దం.
ఆమెతండ్రి రామనాథంగారు వొచ్చారు.
[వయస్సు అరవైదాకా ఉండొచ్చు.]

రామ:—(కుర్చీలో కూర్చొని) అమ్మా ! వాళ్ళందరూ వొచ్చారు.

ఇంది:—(లేచి కూర్చుంటూ) ఎవరు నాన్నా ?

రామ:—మొన్న నీకు చెప్ప లేదటమ్మా—నీకు మనశ్శాం తిని ఇవ్వగల వాళ్ళకు వెయ్యిరూపాయిల బహుమానం ఇస్తానని పత్రికలో ప్రకటించానని ? ఆ బాపతు ఐదారు గురు వొచ్చారు...ఒక్కొక్కళ్లే నిన్ను పరీక్షించి...

ఇంది:—నాకేం జబ్బు—నాన్నా ?

రామ:—అట్లాఅంటావేం—పిచ్చితల్లీ? నీభర్త చనిపోయి సంవత్సరం దాటుతోంది ఆనాటి నుంచీ నువ్వుఎవ్వరి తోనూ సరిగ్గా మాట్లాడవు; నీ కాలకృత్యాల్లో శ్రద్ధ తగ్గిపోయింది. నీ చదువేమో, నీ వేమో, నీ లోక మేమో...

ఇంది:—అది నాలో అనారోగ్య లక్షణాల్ని సూచిస్తోందా?

రామ:—అదేమోకాని—ఇంట్లో దాసీల దగ్గర్నుంచీ, చివ రకు నేనుకూడా నిన్ను అర్థంచేసుకో లేకుండావున్నాం. నీ వైధవ్యం నీలో ఇంతగొప్ప మార్పునూ, బాధనూ తేగలిగినందుకు...

ఇంది:—మా దాంపత్య జీవితం అంత అన్యోన్యంగా గడిచిం దని మీరు నమ్మినట్టున్నారు ?

రామ:—నాకు తెలుసమ్మా—ఏదో డబ్బున్నవాడూ, సీమ క్కూడా పోయి చదువుకున్నవాడూ, చదువుకున్న నీకు తగినవాడూ అని బోలెడు కట్నం ఇచ్చి పెళ్ళిచేస్తే— తాగి తందనాలు తొక్కుతూ, సీమ చదువుతోపాటే, సీమసున్నపు ఛాయగల స్త్రీలను కూడా దిగుమతిచేసి, ఇంట్లోవున్న రత్నాన్ని లెక్క

చెయ్యకుండా, నానాహింసలూ పెట్టేవాడని నాకు తెలియ దనుకున్నావా? ఆ దుర్మార్గుడిమీద ఒక్క మాటన్నా నువ్వు నాతో చెప్పకపోయినా, నాకు అంతా తెలుస్తూనే వుండేది కాని అంతా మించి పొయ్యాక ఏంచేసే అవకాశమూ లేక, ఊరుకోవాల్సి వొచ్చింది...

ఇంది:—మరి అలాటిభర్త పోయినందుకు నాకు దిగులా!

రామ:—అది కాదు... నా లాటి వాడికి నీ మనస్థితి అర్థం కా లేదు కనుక, అర్థంచేసుకోగల వాళ్ళకోసం వెతికాను. ఇప్పుడు...

ఇంది:—నాకు కనీసం బాధగావున్న అనుమానమన్నా లేదు. మీ ఇంటి కప్పుకింద వుండగా, నాకు కావాల్సి నంత మనశ్శాంతి!

రామ:—ఔనమ్మా—ఔను చిన్నతనంలోనే తల్లిపోయిన నిన్ను, కంటికి రెప్పలాగు కాపాడుకుంటూ వొచ్చాను. నేనంటే నీకున్న అభిమానం—నీకు కలిగే లోటు లన్నింటినీ కప్పిపుచ్చుతోంది. నీ బాధను నువ్వే తెలు సుకో లేనంత అమాయకంగా పెరిగావు. నాకు కొడుకు లేడనే బాధ ఎన్నడూ కలగ లేదు. నీ కడుపునపడే సంతానమే యీ ఆస్థిని అనుభవిస్తుందని ఊరుకున్నాను. కాని నీకు సంతానమే కలగ లేదు......... అదంతా అల్లా వుంచు; వాళ్ళను ఒక్కొక్కళ్ళగా ఇక్కడికి

పంపుతాను. ఒక్కరైనా నీ మనోవ్యాధిని కుదర్చలేక పోతారా?

ఇంది:—ఇదంతా నాకు మహా గందరగోళంగావుంది.

రామ:—ఈ ముసలవాడిమీాద విసుక్కోవోక తల్లీ! నా కోసమన్నా నువ్వు కాస్సేపు ఓపికపట్టు—

ఇంది:—(బలవంతాన విసుగును మింగుతూ) సరేకానీండి— మీా మాటను కాదనగలిగే ధైర్యం నాకులేదు.

[ రామనాథంగారు, తల ఆడించి. నవ్వుకుంటూ వెళ్లిపొయ్యారు. ఇందిరాదేవి, కుర్చీలో కూర్చొని, గదిలో ప్రవేశించబొయ్యే అపరిచిత వ్యక్తికోసం వేచివుంది.

(క్షణం గడిచింది)

నలభైఏళ్ళవ్యక్తి ఒకాయన వొచ్చాడు. ఆయన మాటా, బూటూ వ్యవహారంచూసీ, మెడలో వేళ్ళాడే స్టెతాస్కోపును పట్టీ, ఆంగ్లవైద్యుడని గ్రహించవొచ్చు. డాక్టర్ కుర్చీలో కూర్చొని, విజిటింగ్ కార్డు అందిచ్చాడు ]

ఇంది:—(చదివి) ఓ! డాక్టర్ వి. ఈశ్వర్, యల్. ఆర్. సి పి., యం ఆర్. సి యస్. (లండన్)!... 'వి' మీా ఇంటిపేరా?

డాక్ట:—కాదు... ఇండియాలో ఉన్నప్పుడు నా పేరు వేంకటేశ్వర్లు కాని సీమకు పోగానే ఆ దొరలకు నా పేరు నోరుతిరిగేదికాదు. వాళ్ళకు తిరుపతివేంకటేశ్వర మహాత్మ్యం తెలిసి ఛస్తేగా? కనీసం వాళ్ళు ఆ సిసీవూ

అన్నా చూడకపోతే ఎలా అర్థమౌతుందీ?...అందుకని, ఆ పేరు నేనే వి. ఈశ్వర్ అని మార్చి పారేశాను. ఇప్పుడు ఆ 'వి' కి ఎంత విలువో మీకే తెలుసు: 'వి' అంటే—విక్టరీ—విజయం!

ఇంది:—తెలిసింది లెండి!

డాక్ట:—తమకేం జబ్బూ? ఎన్నాళ్ళనుంచీ?

ఇంది:—నా జబ్బు ఏమిటో చెప్పాల్సింది మీరు కాని: నేను కాదు!

డాక్ట:—నిజమే కాని-నేను గ్రహించటం ఆలస్యం కావొచ్చు.

ఇంది:—శాస్త్రాన్ని చదివిన మీరే గ్రహించటం ఆలస్యమైతే, చదవని నేనేం గ్రహించ గలనూ?

డాక్ట:—అంటే-మీ బాధను నేను 'ఫీ' లవలేనుగా! మీకు కనిపించే లోపాలేమన్నా వుంటే చెప్పండి.

ఇంది:—వేళకు అన్నం తింటాను; కాని, కొంత తిన్నాక కడుపు నిండినట్టుగా వుంటుంది. ఈగదిలో హాయిగా పడుకొని, చదువు కుంటూంటాను. రాత్రిళ్ళు నిద్రపడుతుంది; తెల్లారగానే, దానంతట అదే మెళుకూవొస్తూంటుంది. నిద్రలో అప్పుడప్పుడు కలలు కూడా వొస్తూంటయ్...

డాక్ట:—మీకేమన్నా హిస్టీరియా.

ఇంది:—నేనసలు హిస్టరీ చదవను. ఎందుకంటే అది చనిపోయిన వ్యక్తుల్ని గూర్చిన సోది!

డాక్టర్:—హిస్టీరియా అంటే హిస్టరీ చదవటం వల్లరాదు. హిస్టీరియా అంటే - తెలుగులో...

ఇంది:—ఇందాకట్నుంచీ మీరు తెలుగులోనే మాట్లాడుతున్నారనుకుంటున్నాను!

డాక్టర్:—తెలుగేలెండి. కొన్నిచోట్ల సరైన తెలుగుపదం దొరకదు. హిస్టీరియా అంటే-మూర్ఛలవ్యాధి!

ఇంది:—నిద్రతప్ప ఇంకోరకం మూర్ఛను నేను ఎరగను.

డాక్టర్:—పై లక్షణాల్నిపట్టి మీరు ఆరోగ్యంగానే వున్నట్టు కనిపిస్తుంది.

ఇంది:—లోపలి లక్షణాల్ని చూసేందుకు దేహమంతా చీలుస్తారా యేం?

డాక్టర్:—ఎక్స్‌రే కన్నకూడా అది చాలా మంచిపద్ధతి. కాని, ఒకసారి కోశాక, మళ్ళీ యధాప్రకారంగా అతకటం నాకు చాతకాదు!

ఇంది:—నయమే! చేతనౌనని కోసి కూర్చోలేదు!...నాకు ఇంకేమీ జబ్బులేదని తేలినట్టేనా!

డాక్టర్:—అసలు ఆమాటకొస్తే—ఏవ్యాధీ లేకపోవటమే ఒక గొప్పవ్యాధి!

ఇంది:—అట్లాగా? దానికి చికిత్సకూడా వుంది—

డాక్టర్:—ఏమిటది?

ఇంది:—ఏడాక్టరూ, ఏచికిత్సా చెయ్యకపోవటమే-ఒకగొప్ప చికిత్స!

డాక్టర్:—(గుక్క తిప్పుకొని) అట్లా అనకండి. జబ్బులేని వ్యక్తి లోకంలో ఉండడు! ఒకవేళ వున్నా, అలాంటి వ్యక్తిని క్షణంలో రోగిని చెయ్యవొచ్చు!

ఇంది:—ఆఁ, మీ శాస్త్రవిజ్ఞానానికి ఆదెంత సేపూ!

డాక్టర్:—ఇది చాలా గొప్పశాస్త్రమని మీకు తెలియక అలా అంటున్నారు.

ఇంది:—నాకు తెలుసునసే విషయం మీకు తెలియక అలా అనుకుంటున్నారు! పోనీ మీ శాస్త్రం గొప్పతనాన్ని పరీక్షిద్దాం దీనికి జవాబు చెప్పండి! ముందు వ్యాధి పుట్టిందా? చికిత్స పుట్టిందా?

డాక్టర్:—వ్యాధే పుట్టివుంటుంది.

ఇంది:—వ్యాధిపుట్టినకొన్ని శతాబ్దాలకుచికిత్సపుట్టివుంటుంది. అంటే-చికిత్స కన్నా వ్యాధి ఎప్పుడూ కొన్ని శతాబ్దాలు ముందడుగ్గానే వుంటుంది. కనుక, చికిత్స వ్యాధిని ఎన్నటికీ కలుసుకోలేదు.

డాక్టర్:—వ్యాధిని కనుక్కున్న చికిత్సావిధానం త్వరత్వరగా వృద్ధిపొందటంలా?

ఇంది:—అప్పుడు వ్యాధి మాత్రం గోళ్ళు గిల్లు కుంటూ కూర్చుందా? అదికూడా ఇంకా ఘోరంగా లొంగకుండా పెరుగుతూనే వుంటుంది. మళ్ళీ అలా పెరిగి, మారిన వ్యాధికి చికిత్స కనుక్కునేప్పటికి మరికొన్ని శతాబ్దాలు గడిచి పోతయ్. పుటకలోనే కొన్ని శతాబ్దాల వార

వున్నప్పుడు - ఇంక కలుసుకోవటం కల్ల! అసలు ఏది ఏ వ్యాధో ఎవరికి తెలుసూ?

డాక్ట:—ఎందుకు తెలియదూ?

ఇంది:—ఎలా తెలుస్తుందీ?

డాక్ట:—వ్యాధి లక్షణాన్ని పట్టి. ఫలానా వ్యాధై వుంటుం దని ఊహించి, చికిత్స ప్రారంభిస్తాం.

ఇంది:—అలాటి వ్యాధులే ఇంకా అనేకం ఉండ కూడదా?

డాక్ట:—ఉండొచ్చు, అందుకనే మనం నమ్మిన వ్యాధికి చికిత్స ప్రారంభిస్తాం. మనమందు పట్టిందంటే–ఆ వ్యాధిని సరిగ్గానే కనుక్కున్నా మన్నమాట! ఒక వేళ మొదట్లో పొరబడ్డా మనుకుందాం. కొంతదూరం పొయ్యాక, వ్యాధి పెరిగి ఒక స్థిరైన రూపానికి వొస్తుంది. అప్పు డైనా మనం సరిగ్గా గ్రహించగలం—

ఇంది:—అప్పుడు తెలుసుకొని మాత్రం ఏం లాభం? ఇప్ప టికే మితిమీరిన ఆలస్యమై వుంటుంది; మానవమాత్రుడి విజ్ఞానానికి లొంగని వ్యాధిగా అది మారి కూర్చుం టుంది.

డాక్ట:—దానికి ఎవరేం చెయ్యగలరూ? అది అంతఘోరంగా పెరక్కపోతే కుదిరేదేకదా ?

ఇంది:—ఆది మాత్రం ఏం లాభం? అది కుదిరే లోపల, లోపలికి మీారు పోసేవిషాలు కొత్తజబ్బుల్ని ఆరింటి నస్సాళ్ళ తయారుచెయ్యక మానవు. అంతా ఊహామీాధా

ఎక్స్పరిమెంట్లమీదా ఆధారపడ్డ చికిత్స కనుక, ఇలాటిది అమిత సామాన్యం ఈ కొత్త జబ్బుల్లో ఒక్కోదానికే, మళ్ళీ మామూలు ప్రకారం చికిత్స ప్రారంభం. అంటే ఒక్కోటి నయమౌతూ, మరో అరడజన్ను మొదలిపోతూ వుంటుంది. కొన్నాళ్ళ కల్లా— ఆరు వ్యాధులున్న మనిషికి, ఆరు ఐదులు (ఆరులో ఒక్క జబ్బు మాత్రమే నయమౌతుంది కనుక? ముప్ఫై వ్యాధులు పట్టుకుంటయ్—

డాక్టః—అది రోగి అదృష్టం!

ఇంది:—ఔను. రోగి అదృష్టవంతుడైతే తప్ప, వ్యాధి విషానికి తోడైన మందుల విషాన్నికూడా దూసుకుపోలేని మాట నిజం? అసలు ఏ వ్యాధి పుట్టక ఎక్కడో ఎవరికి తెలుసూ?

డాక్టః—వ్యాధి పుటకతో మాకు పనిలేదు; దాని చికిత్సతోనే—

ఇంది:—ఏవ్యాధీ కూకటివేళ్ళలో మొదలదన్నమాట; ఎందుకంటే - అసలు వేళ్ళెక్కడో తెలుస్తేగా? వేళ్ళంటూ ఉన్నాక—ఏనాటికైనా, వృక్షం పెద్దదై ఊడల్నీ, మ్రానుల్నీ దింపుకోకమానదు!

డాక్టః—వ్యాధి పుటకనుగూర్చి ఆలోచించటం కాలయాపన...అది ఇంకోమనిషినుంచి పాకి ఉండొచ్చు.

ఇంది:—ఆ మనిషికో?

డాక్ట:—ఇంకో మనిషినుంచి—

ఇంది:—ఈవిధంగా మనం లోకంలోని మొట్టమొదటి రోగి దాకా వెళ్తాం మరి ఆ మొదటి వాడికి యీజబ్బు ఎలా వొచ్చి ఉంటుందీ!

డాక్ట:—ప్రకృతినుంచి వొచ్చి ఉండ వొచ్చు.

ఇంది:—ఏ ప్రకృతి యీ వ్యాధిని ప్రసాదించి వుంటుందో, ఆ ప్రకృతిలోనే దీనికి చికిత్స కూడా వుండి వుంటుందని మీరు నమ్మగా?

డాక్ట:—నిజమే! శాస్త్రజ్ఞులు ఇదే ఆలోచించి, వ్యాధి తాలూకు పురుగుల్ని చంపి, ఇంజక్షన్ రూపంలో ఇస్తే, దేహంలో క్రమంగా అవ్వి ఏంటీబాడీస్ తయారు చేసి, వ్యాధినుంచి రోగిని కాపాడుతయ్. దీన్నే వాక్సిన్ అండ్ సిరమ్ చికిత్స అంటారు.

ఇంది:—మొదటి వాడి వ్యాధిలోని పురుగుల్ని రెండోవాడికీ, రెండో వాడివి మూడో వాడికీ, పంచు తున్నా రన్నమాట?

డాక్ట:—అంతే!

ఇంది:—అంటే యీ రెండో వాడి వ్యాధి సరిగ్గా మొట్ట మొదటి వాడి వ్యాధి లాటిదే కాకపోతే— అది సరిగ్గా, పూర్తిగా పని చెయ్యదు. అన్ని విషయా ల్లోనూ సరిగ్గా ఒకదాన్ని పోలిన మరో వస్తువు ఇంత వరకూ సృష్టిలో లేదు! ఇందుకు ఒక్కటే మినహా

యింపు వుంది : అసలు వస్తువును పోలిన దాని ఛాయ! అంటే మీరు వ్యాధికి, దాని ఛాయను ఎరగా వేస్తున్నా రన్నమాట ? ఎవరి వ్యాధితో తయారైన వాక్సిన్ వాడి వ్యాధికీ పని చెయ్యటంలో అర్ధం వుంటుంది కాని, ఒకడి వాక్సిన్ ఇంకోడికి ఎలా పని చేస్తుందీ ?

డాక్టః—అది నిజమే కాని, ఎవరివాక్సిన్, వాడికోసం తయారు చెయ్యటం వ్యయ ప్రయాసల్తో కూడినపని. అంత వ్యవధీవుండదు.

ఇంది:—అందుకని, యీ తెలివితక్కువ పద్ధతుల్ని నేర్పిన శాస్త్రం— లాభం లేదు. దాని గొప్పతనం బైట పడేది ఎప్పుడంటే— చచ్చినవాణ్ని బతికించ గలిగి నప్పుడు !

డాక్ట:—అది అసంభవం! ప్రకృతే స్తంభిస్తుంది !

ఇంది:—తెలిసివుండీ, దాన్ని పట్టుకొని వేళ్లాడటంలో అర్ధం లేదు! ప్రకృతి సృష్టించుకుంది; అదే నాశనం చేసు కుంటుంది మీరు అడ్డువెళ్తే—దానికి మరి దారిలేక ఇంకా ఘోరమైన వ్యాధుల్ని, మీకు అందనివాటిని సృష్టించుకుంటుంది—

డాక్ట:—ప్రకృతిని ఆపుతానని నేను బయలుదేరలేదు !

ఇంది:—వ్యాధినీ ఆపలేరు...మీతో లాభం లేదు—

డాక్ట:—(గొణుక్కుంటూ)నావిజ్ఞానమూ, నాచాకుర్యమూ,
నా డిగ్రీలూ......

[బుఱ్ఱగోక్కుంటూ వెళ్ళిపొయ్యాడు. క్షణం నిశ్శబ్దం
ఇంకో ముసలాయన వొచ్చాడు. ఆయన వాలకంచూస్తే అన్ని
ఉద్యోగాలకూ పనికివొచ్చే రకంగా ఉండటంవల్ల, మనకేమీ తోచదు.]

ఇంది:—కూర్చోండి...తమరు...?
వ్యక్తి:—(కూర్చొని) నేను పిచ్చిడాక్టర్ను!
ఇంది:—(అదిరి) పిచ్చిడాక్టరా? మీకు పిచ్చి ఎక్కితే,
పిచ్చాసుపత్రికి వెళ్ళక, ఇలా దయచేశారేం?

పిచ్చిడా:—(గుక్కతిప్పుకొని) అంటే పిచ్చికుదిర్చేడాక్టర్ను.
ఇంది:—అలాగా? ఇక్కడ పిచ్చివాళ్ళెవరున్నారనివొ
చ్చారూ?
పిచ్చిడా:—తమరే!...కోపగించకండి...అసలు పిచ్చిలేని
వ్యక్త్యంటూ లోకంలో లేదు. మనిషికోరకం పిచ్చి!
ఇంది:—ఐతే తమకు ఏరకం పిచ్చో శెలవిచ్చారు కాదు?
పిచ్చిడా:—(బుఱ్రగోక్కొని) నాకా? నాకు పిచ్చికుదిర్చే
పిచ్చి!
ఇంది:—ఐతే, నాకు ఏరకం పిచ్చి?
పిచ్చిడా:—అదేచూస్తున్నాను. మీమాటలధోరణీ,ప్రవర్త
నాచూస్తే, ఏరకం పిచ్చి కిందికి మీరువస్తారో అర్థం
కాకుండావుంది. మా ఆస్పత్రికి వొచ్చి ఏరోగితోనన్నా

ఒక్క అరగంట మాట్లాడితే, ఏదో ఒకరకం పిచ్చి మీకు రాకపోదు!

ఇంది:—మరి మీకెందుకు పిచ్చెక్కలేదూ ?

పిచ్చిడా:—నేనసలు రోగుల్తో మాట్లాడను!

ఇంది:— ఇంక చికిత్సమాత్రం ఏం చేస్తారూ ?

పిచ్చిడా:—చేస్తాను. కాని వాళ్ళతో మాట్లాడి నేనుకూడా పిచ్చివాణ్నయిపోతానేమో నని భయం!

ఇంది:—అప్పుడు మీకు మరో పిచ్చిడాక్టరు దొరకటం కూడా కష్టమే! ఐనా, మీకు రాబోయ్యేపిచ్చినే కుదుర్చుకోలేని మీరు,ఎదుటివ్యక్తిపిచ్చిని కుదురుస్తానని బయలు దేరటం—గుడ్డివాడు, ఇంకో గుడ్డివాడికి దారిచూపటం లాగుంది!

పిచ్చిడా:—వాళ్ళతో ఏంమాట్లాడమంటారూ? వాళ్ళు మాట్లాడేది ఏం అర్థమౌతుందీ? దగ్గరికిపోతే దేహశుద్ధి చేస్తారనే భయంకూడా లేకపోలేదు!

ఇంది:—పిచ్చివాడి తెలివి తేటల్ని అందుకోగల విజ్ఞానమన్నా మీకులేదు. అసలు మీకు ఎప్పుడన్నా పిచ్చి ఎక్కిందా?

పిచ్చిడా:—నాకా? లేదు. నాకు పిచ్చిఎక్కివుంటే. తమ దర్శన భాగ్యమే కలిగేదికాదు. ఎందుకంటే నన్ను పిచ్చాసుపత్రిలో బంధించి ఉండేవాళ్ళు. అసలు వొదిలి పెట్టే వాళ్ళేకాదు!

ఇంది:—మీకు ఎట్లా పిచ్చికుదరదో, ఎవ్వరికీకూడా కుదరదు! ఇక మీరు వెళ్లొచ్చు.

పిచ్చివా:—అంతేనా?...అంతే!...అంతే!

[ వెళ్ళిపొయ్యాడు. క్షణం నిశ్శబ్దం. ఇంకో వ్యక్తి వొచ్చాడు. పెద్ద తలపాగా, మోకాళ్ళదాకా కోటూ, కళ్ళజోడూ గమనించదగ్గవి. కుర్చీలో దర్జాగా కూర్చొని, విజిటింగ్ కార్డు అందిచ్చాడు. ]

ఇంది:—(చదువుతూ) కాళీప్రసన్న, సాముద్రిక సామ్రాట్ శ్రీమాన్......శ్రీమాన్...... శ్రీమాన్.........

శ్రీమాన్:—శ్రీమాన్ గండభేరుండాచార్య!

ఇంది:—గండభేరుండంగారూ! మీరు జోతిష్కులా?

గండ:—ఔనమ్మా!

ఇంది:—నాకేం జోతిష్యం చెప్తారూ?

గండ:—మీ కసలు యీ జబ్బు కుదురుతుందో లేదో—

ఇంది:—అందుకు ముందు, యీ వెయ్యిరూపాయిల బహుమానమూ తమకు వొస్తుందో రాదో చూసుకున్నారా?

గండ:—అది తమరు తృప్తిపడటాన్ని బట్టివుంటుంది.

ఇంది:—మీకు ఆ అదృష్టమే వుంటే - మాకు తృప్తికలుగుతుంది. మీ భవిష్యత్ సంగతి మీకు తెలియదు. ఇతరుల భవిష్యత్‌ను గూర్చి చెప్తామని బయలుదేరారు!

గంఢ:—అలా అనకండి. నేను భూతకాలంలో జరిగిన సంగతుల్ని పూసగుచ్చినట్టు చెప్పగలను.

ఇంది:—దాని వల్ల ప్రయోజనం లేదు. ఎందుకంటే ఆ సంఘటనలన్నీ జరిగిపోయినై. ఏమైనా తప్పులుంటే, దిద్దుకునేందు కన్నా ఆ రోజులు మళ్ళీ తిరిగిరావు. అదీ కాక, ఆ సంఘటనలన్నీ పూసగ్రుచ్చినట్టు నాకే తెలుసు కనుక, మీ నోటినుంచి వినే అవసరం లేదు.

గంఢ:—పోనీ వర్తమానంలో—

ఇంది:—వర్తమానం జరుగుతూనేవుంది. నాకు కళ్ళున్నయ్ కనుక, నేనే చూసి గ్రహించుకోగలను! మీ సహాయం ఇక్కడ కూడా అనవసరం.

గంఢ:—పోనీ భవిష్యత్ –

ఇంది:—ఆ జరగబోయ్యే సంఘటనల్ని గూర్చి – ఆ గాఢాంధకారంలోకి చూస్తూ మీరు రైటే చెప్పారో, తప్పే చెప్పారో తెలుసుకోగలిగే శక్తి నాకు లేదు. అందుకని, మీరు చెప్పిందానికల్లా తలూపుతూ కూర్చోవటం మూర్ఖ్యం. అదీకాక, ఆ భవిష్యత్‌లో మంచీ ఉండొచ్చు; చెడూ ఉండొచ్చు. మీరు మంచిని చెప్పటం వల్ల – ఆ సంఘటనను ఇప్పుడే తలుచుకొని, ఆ ఆనందంలోని – అత్యధిక భాగాన్ని ఇప్పుడే అనుభవించేస్తాం; నిజంగా అది జరిగేనాడు అనుభవించేందుకు ఆనందం చాలా కొద్దిగా వుంటుంది. ఇక చెడును

గూర్చి చెప్తే, ఇప్పటి నుంచే దిగులు పడి పోతాం. అసలు జీవితపు రహస్యా లన్నింటినీ ఇప్పుడే తెలుసుకుంటే, జీవించి అనుభవించేందుకు ఇంకేం వుంది? అదీ కాక, ఆ భవిష్యత్ లోని సంఘటనల నుంచి తప్పుకునే మార్గం కూడా ఉండదాయె!

గండ:—ఎందుకు లేదూ?

ఇంది:—అలా ఉంటే—మీరు చెప్పేభవిష్యత్ తప్పవుతుందికదా?

గండ:—అది కాదు...గ్రహాలు చేసే చెడుగునుంచి తప్పుకునేందుకు, తాయిత్తులూ, రాళ్లూ మంత్ర మహాత్తుతో తయారు చేశాను.

ఇంది:—అవ్వి మీరే ధరించండి...ఇక్కడ మీకేమీ సావకాశం లేదు—

గండ:—అంతేనా? నా భవిష్యత్ ను గూర్చి నేనే తెలుసుకున్నట్టయితే—ఈ బత్తె ఖర్చులు దండగ పడే వాణ్ణి కాదు!

[వెళ్ళిపోయ్యాడు. క్షణం నిశ్శబ్దం. ఒక యువకుడు వొచ్చాడు. పొడుగైన జులపాలూ, ఫ్రెంచికట్టు మీసమూ, వొదులుచేతుల సన్నని లాల్చీ, కళ్ళకుజోడూ— చూడగానే నవకవి ఐ ఉంటాడని ఇట్టే తోస్తుంది. పైకిచూస్తూ నడిచి వొస్తున్నాడు.]

ఇంది:—తమరు?

కవి:—(భుజాల్ని ఎగరేస్తూ) నేను—పక్షిని!

ఇంది:—పక్షా ? మీకు రెక్కలున్నా లేవే ?

కవి:—రెక్కలుంటే, ఆకాశంలోనే ఎగిరిపొయ్యేవాణ్ని !

ఇంది:—మీరు మరి ఏ రకం పక్షులూ ?

కవి:...ప్రేమ పక్షిని ! ప్రేమ బికారిని !

ఇంది:—కూర్చోండి ... పక్షిగారూ ! మీరేం చేస్తూంటారూ ?

కవి:—కవిత్వం—ప్రేమకవిత్వం— ప్రణయ కవిత్వం—రాసేస్తా—గీకేస్తా—!

ఇంది:—తమకవిత్వం నాకేం ఉపయోగం ?

కవి:—జీవితం చప్పబడ్డప్పుడు. కవిత్వంకన్నా మధురపదార్థం ఇంకోటిలేదు. బాధల్ని మరిచిపొయ్యేట్టుచేసే అంజనం—కవిత్వం !

మచ్చుకు ఇది వినండి; చీకటి కటికచీకటి...గాఢాంధకార బంధురం...అప్పుడు నాయకుడు, నాయకిని ఉద్దేశించి—

ఇంది:—ఆగండి...కటికచీకటిలో తమకెల్లా కనిపించిందీ ?

కవి:—కవిగాణ్ని కనుక, మనకు స్వంతపనులేమీ లేవు కనుక, ఐదుబ్యాటలీల ఎవ్వరెడీ లైటు వేసుకొని బయలుదేరాను.

ఇక వినండి:—నాయకుడు ఏమన్నాడయ్యాఅంటే—

(హరిదాసుడిలాగు లేచినిలబడి)

పా ట

నిద్రపోతుంటేను—నువ్వొచ్చి లేపావు
నిద్రమెళుకూ రాక —నీ వెంటనడిచాను—

ఇంది:—నిద్రమెళుకూరాకుండా ఆమె వెంటనే నడవటం కష్టం. నిద్రమత్తులో ఇంకెటన్నా పోవొచ్చు. కనుక నాయకి ఎత్తుకొనిపోవటమో, వీపుమీాన ఉప్పుప్పుగోనెగా వేసుకొని వెళ్ళటమో ఉచితం—

కవి:—నిజమేకాని, నా నాయకి సుకుమారగాత్రి ! సిమెంటు బస్తాలాంటి నాయకుణ్ని మోసేందుకు అలవాటు పడలేదు.

ఇంది:—సరే-తరువాత ?

కవి:—వినండి —

పా ట

పాలసంద్రంలోకే - తీసుకెళ్తావో -
నీళ్ళసంద్రానికే - లాక్కుపోతావో -

ఇంది:—లాక్కుపోవటం దేనికీ ?

కవి:—ఉప్పునీళ్ళంటే నానాయకుడికి ఇష్టమనుకున్నారా? అదీకాక వాడికి ఈతరాదు. చచ్చిపోయ్యే పక్షంలో

ఉప్పునీళ్ళు తాగి చావటంకన్న, పాలుతాగి చావటం మంచిది!

ఇంది:—నాయకుడికి ఈత నేర్పలేకపొయ్యారా?

కవి:—ఇలాటి ఇబ్బందులు ఉంటయ్యని తెలిసి ఏకు_స్తేగా? నేర్చుకునేదాకా ఆగాడూ? దొరికిందే ఛాన్సు అని నాయకుడై కూర్చున్నాడు. నేలమీద మాత్రం యీదగలడు! అంతే!...అదంతా అలావుంచండి: ఇందాకటి పాటకు తమ హృదయం ఉప్పొంగలా? తమ ఊపిరితిత్తులు ఉద్రేకంతో...ఉద్రేకంతో...(మాటలు దొరక్క తడపడుతున్నాడు.)

ఇంది:—లేదు...ఏమీలేదు!

కవి:—అంటే, మీకు కవితాహృదయం లేదన్నమాట. ఐనా యీ గేయాన్నికూడా వినండి.

(గేయం)

ఉందిరా - యీ గొందిలో

నా బందీగా - ఆ ఇందిరా

ఇంది:—ఇందిరా! నా పేరేనే!

కవి:—(సగంచచ్చి) క్షమించండి...కనపడ్డ ఆడదాని మీదల్లా కవిత్వం బరికేశాను-

ఇంది:—గొప్పపని చేశారు. మరి మొగాళ్ళకు అన్యాయం చేశారేం? వాళ్ళమీదకూడా బరికెయ్యక పొయ్యారూ?

కవి:—మొగాళ్ళల్లో చదువుకున్న వాళ్ళెక్కువ. చదువు కున్న వాళ్ళల్లో నూటికి తొంభైమంది కవిత్వం రాయ గలరు. వాళ్ళకు వాళ్ళే బరుక్కుంటారు కనుక, మనం బరకాల్సిన అవసరంలేదు—

కవి:—అదే...నేనన్నమాట...పొయటిక్ 'వ్యూ' లెండి.

ఇంది:—జడభరతుడిలాగు జుట్టు పెంచారు – టాగూర్ మోడల్ లోనే వుంది–

కవి:—సరిగ్గా గ్రహించారు. ముందు షేప్‌లోనన్నా టాగూరునైతే–

ఇంది:—ఔను. సిరి అంటకపోయినా, చీడన్నా అంటు తుంది–

కవి:—మీరు నా కవిత్వాన్ని పూర్తిగా ఆస్వాదించి–

ఇంది:—ఇంకొద్దు. ఇప్పటికే నా శరీరంమీద గొంగళీ పురు గులు పాకుతూన్న ట్టనిపించింది.

కవి:—పోనీ కాలక్షేపం–

ఇంది:—నా కాలం విలువను మీరు చాలా చిన్నచూపు చూస్తున్నట్టుంది. పోనీ మీ అచ్చు పుస్తకాలేమన్నా వుంటే, ఇల్లా పడేసిపోండి. తీరుబడి ఐనప్పుడల్లా చదువు తూంటాను.

కవి:—నా రచనలన్నీ అచ్చువటమంటే మాటలా? అచ్చుగా ఒక్క టిటాగర్ పేపర్ మిల్లూ ఒక టైమ్స్ ఆఫ్ ఇండియా ప్రెస్సూ ఒక సంవత్సరంపాటు పనిచేస్తే

అవుతయ్! అదీకాక, కవిఅంటే కుచేలు డన్నమాట! మీలాంటి ఐశ్వర్యవంతు లెవర్కైనా అంకితం వేసు కొని............

ఇంది:—అంకితం వేసుకున్నందుకు మీరు ఒక్కో పుస్త కానికి ఏం ప్రతిఫలం ఇవ్వదలిచారూ!

కవి:—నేను ఇవ్వటమా? అది లోకధర్మంకాదు. ఐనా నా దగ్గర ఏముందీ ఇచ్చేందుకు? ఏదో మీరు అంతగా అడుగుతున్నారు. కనుక, ఒక్కపుస్తకం అంకితం వేసుకున్నందుకు, ఇంకో అరడజను పుస్తకాల్ని అంకితా నికి సిద్ధంగా వుంచుతాను.

ఇంది:—మీ కవిత్వం—మావూరి డ్రెయినేజ్ కాలవలాగు తిరిగే ప్రవాహంగాలేదు. అలాంటిదాన్ని నేను భరించ లేను. పోనీ మీ కవిత్వాన్ని దేశంమీద చలామణీ చెయ్యలేకపొయ్యారా?

కవి:—ఈ ప్రజలు వొట్టి మూర్ఖులు!

ఇంది:—ప్రజల్ని తిట్టటంవల్ల ప్రయోజనంలేదు. ఎందుకంటే మిమ్మల్ని ఆకాశానికి ఎత్తినా, పాతాళానికి పడేసినా— ఈ ప్రజలే! అందుకని, మీరు ప్రజలకోసం కవిత్వం రాసి—

కవి:—ఆ స్టంటూ వేసిచూశాను. ప్రజాకవిత్వం అని పెద్ద హెడ్డింగ్ పెట్టాను; ప్రజానాటికలు అని మోత పుట్టిం చాను. ప్రజాకథలు, ప్రజాప్రోజూ, ప్రజాపొయట్రీ, ప్రజా.............

ఇంది:—అన్నింటికీ ముందు ప్రజనుకలిపానవండి.

కవి:—కలిపినా ఒక్కడూ టోపీపడలేదు. ఇంత వాస్తవికతను నేను చిత్రించినా...

ఇంది:—మీరు వాస్తవికతను రాశారా?

కవి:—లేకపోతే ప్రజాకవిత్వం ఎలాఅవుతుందీ? అతి వాస్తవికంకూడా గీకాను. రియాలిటీ — ఫక్తురియాలిటీ — యదార్ధదృశ్యాలే—దింపానంటే నమ్మండి.

ఇంది:—రియాలిటీ కవిత్వంకాదు—

కవి:—మరి ?

ఇంది:—రియాలిటీ అంటే వార్త ! ఒట్టి రియాలిటీయే రాసే వాడు పత్రికా విలేఖరన్నమాట! అచ్చుగా యదార్ధ దృశ్యాల్నే చిత్రించేవాడు ఫొటోగ్రాఫరు! రియాలిటీని మనం చూస్తూ, అనుభవిస్తూనే వున్నాం. కొబ్బరి చెట్టు ఉండగా, ఒళ్ళు బలిసి దాని బొమ్మ దేనికీ ?

కవి:—మరి బొమ్మనుచూసి మెచ్చుకునేవాళ్ళ ఒళ్ళు బలవలా !

ఇంది:—లేదు. అది కొబ్బరిచెట్టు ఆకారమేకాని, కొబ్బరి చెట్టును చూసినదానికన్న కొత్తరకం ఆనందాన్ని ఇస్తోంది.

కవి:—ఊహుఁ. పోనీ యీ రియాలిటీనుంచి దూసుకుపోయి, ఊహా ప్రపంచంలో గంతులు వేద్దామని రాసిన రచనల్ని ప్రజలు మెచ్చుకోలేదు !

ఇంది:—మీకు కలిగిన ఉద్రేకమూ, ఊహాపాఠకుడిలో కలిగే అవకాశాన్ని మీరు కలిపించ లేక పొయ్యారన్న మాట! అదీకాక, ఒట్టి ఊహమీదనే ఆధారపడే కవిత్వం—తాగినవాడు మాట్లాడే మాటల్లాటిది !

కవి:—ఆ ఉద్రేకమూ అదీ పాఠకుడు కలిగించుకోవాలి. ఆ రసగ్రహణహృదయం కావాలి.

ఇంది:—అంతటి రసహృదయమే కనుక పాఠకుడికి వుంటే, మీరచనలు చదివే ఖర్మం పట్టదు. ఆ పాఠకుడే—రచయితయి కూర్చునేవాడు !

కవి:—మరింక కవిత్వం లేదా ?

ఇంది:—లేకేం - అటు రియాలిటీకీ, ఇటు ఊహా మాత్రానికీ, మధ్య వుండే త్రిశంకు మెట్టయి వుంటుంది.

కవి:—ఆహా !

ఇంది:—పోయి అలాటి కవిత్వం రాయండి...

కవి:—నేను రాసుకొచ్చేదాకా, మీరు యీ స్థితిలోనే వుంటారా అని ఆలోచిస్తున్నాను.

ఇంది:—ఎందుకూ ?

కవి:—మీ మనస్సుకు ఆనందం కలిగించి, యీ బహుమానాన్ని సంపాయిద్దామని.

ఇంది:—ముందు మీ మనస్సులోని తుప్పును వొదల గొట్టుకోండి.

కవి:—ఔను...,తనకు లేని ధర్మమూ అన్నారు.

[వెళ్లిపొయ్యాడు. క్షణం నిశ్శబ్దం. ఒక ముసలాయన వొచ్చాడు. నీరు కావిరంగు పంచా, పైన ఉత్తరియ్యం, చెవులకు కుండలాలూ, చేతులకు బంగారు గండభేరుండాలూ — మొత్తానికి ఒక దైవభక్తుడల్లే కనిపిస్తున్నాడు]

ఇంది:—దయచేయండి...మీరు దైవభక్తులల్లే వుంది.

దైవ—ఔనమ్మా—ఔను.

ఇంది:—మీరిచ్చే నాకిచ్చే సలహా ఏమిటీ?

దైవ:—ఈ దుర్భరజీవితాన్ని భరించలేనప్పుడు, మనస్సును దైవంమీద లగ్నంచేసి, భక్తితో—

ఇంది:—అంటే యీ లోకంలోని వస్తువులేవీ మనకు పనికి రానప్పుడు, దైవం గతన్నమాట? అంటే పనికిరాని వస్తువుల్లో చివ్వరివాడు దైవం! ఐనా అదంత సులభ సాధ్యమైన పనా?

దైవ:—సాధించవలె! ఇలా ఆలోచించటం మొదలుపెట్టు: అసలు యీ ప్రపంచమే మాయ. నువ్వూమాయ—

ఇంది:—(తనను చూసుకుంటూ) నేను బతికివుంటేనే — మాయా? మరి తమరో స్వామీ?

దైవ:—నేనూ మాయే! అసలు సృష్టికీలకమే అది!

ఇంది:—ఆగండి; మీరే మాయఐతే, మీమాటలు అంత కన్నామాయ; నేను వినటం అసలేమాయ! అసలు మాయ అంటే ఏమిటీ?

దైవ:—(సగర్వంగా) శూన్యం...ఏమీ లేదన్నమాట!

ఇంది:—ఈ ఏమీ లేనిదానిలోంచి యీ సృష్టంతా పుట్టు కొచ్చిందన్నమాట ?

దైవ:—అదంతా కూడా మాయే !

ఇంది:—సరే... ఈ శూన్యాన్ని గూర్చి జీవితమంతా ఆలోచించి, తలబద్దలు కొట్టుకోవటమూ, ఇంత శ్రమపడి ప్రచారం చెయ్యటమూ, హాస్యాస్పదం. అందుకని మీరు చెప్పే యీ 'శూన్యం'లో గొప్పరహస్యం ఏదో ఉండివుండాలి. ఆ వున్నదాని కోసం అందరూ ఎగబడతారేమోనని, చాలామందిని యీరకం ప్రచారంతో నిరుత్సాహ పరుస్తున్నట్టున్నారు...

దైవ:—నీ యీడు వ్యక్తులు ఇలామాట్లాడటంలో ఆశ్చర్యమేమీ లేదు. అందులోనూ హిందూవితంతువుకు ఇలాటి క్రూరపు ఆలోచనలు ఉండరాదు. ఆ భగవత్ చింతే వుంటే, అది సమస్తమైనటువంటి మనఃక్లేశాల్నీ రూపుమాపి...

ఇంది:—మీ కది అనుభవంవుందా ?

దైవ:—లేకేం... పొద్దున లేచినప్పటినుంచీ నేను చెప్పేదే అది !

ఇంది:—ఆగండి; సమస్త మనఃక్లేశాల్నీ అని సెలవిచ్చారు-

దైవ:—ఔను.

ఇంది:—అన్నీ వొదిలి యీ ప్రచార మనఃక్లేశం గట్టిగా పట్టుకుందన్నమాట ?

దైవ:—అది నేను మానవజాతికి చేసే సేవ—పరోపకారార్థం యీ వెధవశరీరం—

ఇంది:—బోడిశరీరం! పాడుశరీరం?...ఐనా యీ ప్రచారం వల్ల ఏంలాభం స్వామీ?

దైవ:—అట్లాఅడుగు. చివరకు ముక్తి! స్వర్గం!

ఇంది:—చచ్చాకనా? బతికి ఉండగా అన్నికోర్కెల్నీ, ఆశల్నీ చంపుకొని, ఇంకోపనేమీ లేకుండా యీ భగవత్ ధ్యానంతో అలసిపోతూ బాధపడతాం. అంటే కోర్కెల్ని తీర్చుకోవటంవల్ల తరువాత పడాల్సిన నరక బాధను, ఆ కోర్కెలు తీర్చుకోక పోవటంవల్ల ఇక్కడే పడతాం! అందుకని ఇక స్వర్గమే! కాని, ఆ కోర్కెల్ని ఇక్కడే అనుభవించి పారేసి, అవ్వి అనుభవించక పోవటం వల్ల కలిగే యమబాధనుంచి దూసుకుపోతే...

దైవ:—తరువాత నరకం తప్పదు!

ఇంది:—మన నెత్తిమీద స్వర్గమేవుందో, నరకమే వుందో ఎవరు చూశారూ? చూసి వొచ్చామని చెప్పినా ఎవరు నమ్మగలరు? చూశాక మళ్ళీ రావటమంటే—చచ్చిన వాడు బతకటంలాటిదే కనుక—అంతా ఊహలో ఆ స్వర్గాన్ని చూడాలి! ఒకవేళ ఆ నరకమే లేక పోవొచ్చు. లేనిపక్షంలో అక్కడి బాధల్నికూడా దూసుకుపోవొచ్చు కదా!

దైవ:—మహాజ్ఞానులందరూ యీ విషయాల్నే కనిపెట్టారు.

ఇంది:—ఔను. అలా ఎత్తువేస్తేనే కాని యీ ప్రచారం సక్రమ మార్గంలో సాగదు. ఇది సులభమార్గంలో మరో రకం వాదనకు అవకాశంలేకుండా యీపద్ధతిని కనిపెట్టారు. అసలు ఆ కనిపెట్టినవాళ్ళు మానవమాత్రులే! చూసేందుక్కూడా వీల్లేకుండా, వాళ్ళు చాలా కాలం కిందటే యీలోకాన్ని వొదిలి పెట్టి-మీరన్న స్వర్గంలో స్థిరనివాసాన్ని ఏర్పర్చుకొని వుంటారు. మీరు వాళ్ళం దర్నీ జ్ఞానుల్ని చేసి పారేశారు. ఎందుకంటే 'జ్ఞాని' స్థానాన్ని మీరు సులభంగా ఆక్రమించుకునేందుకు! తాగినవాడు ఆ తాగుడు చాలా హాయిగా వుంటుందని ప్రచారం చెయ్యటం నైజం! అసలు యీ రకం ప్రచారం వల్ల మీరే ఒక దేవుడయ్యేందుకు ప్రయత్నిస్తూ న్నట్టుంది!

దైవ:—నేనా? నాకంత ఆశ లేదు.

ఇంది:—క్రమంగా కలుగుతుంది. ఆ దేవుడనేవాడు ఎన్నాళ్ళకూ కనిపించక పోవటంవల్ల - నిరాశను ఎదుర్కోలేని మానవులు, దేవుడి ఛాయ కోసం వెతకటం ప్రారంభిస్తారు అంటే దేవుడి తరువాత దేవుడంతటివాడు - దేవుడి ఏజెంటైన మీకు ఆ స్థానం దానంతట అదే వొస్తుంది. ఇంతమందినీ ఆ స్వర్గంవైపు మళ్ళించటం కూడా ఒక ప్రమాదమే!

దైవ:—ప్రమాద మేముంది?

ఇంది:—వీళ్ళందరూ అక్కడ పోటీయే కదా ?

దైవ—ఇక్కడ ఉండలా ? అలాగేఅక్కడా ఉంటారు. మీరూ రండి...వొద్దన్నామా ?

ఇంది:—స్వర్గంలో మొగవాళ్ళకు రంభా ఊర్వసులు ఉన్నారు. కాని, ఆడవాళ్ళకు ఏముందీ ? ఏమీ లేదు ! నాకు అనవసరం !

దైవ:—పోనీ స్వలాభాపేక్ష లేకుండానే భగవంతుణ్ని కీర్తించండి—

ఇంది:—అనవసరంగానా ? కీర్తించటం దేనికి ?

దైవ:—మనకు యీలోకాన్నీ, యీ సుందరమయమైన ప్రకృతినీ కల్పించి ఇచ్చినవాణ్ని కీర్తించరా ? మీ కృతజ్ఞతను చూపరా ?

ఇంది:—ఒక్కసారి కృతజ్ఞతను చూపవొచ్చు. కాని జీవిత మంతా కీర్తించటమేనా పని ? అదీకాక యీసుందర మైన ప్రకృతి మనకోసం మనం అనుభవించేందుకు ! దేవుడి ఉద్దేశం మనను అనుభవించమనే కాని, చచ్చే దాకా తనను కీర్తించమనికాదు. ఏదైనా రుచికరమైన పదార్థం మీముందు పెడితే—అది తినకుండా దాన్ని తయారుచేసి యిచ్చిన వ్యక్తిని పొగుడుతూ కూర్చో టంలాగుంటుంది—పొగడ్తకు పొంగిపోయి—ఆ లంచం తో, మానవుడి ఇహలోక యాత్రానంతరం ముక్తిని ప్రసాదించే, సామాన్య మానవ హృదయంలాటిది దేవు డికి వుందంటారా ?

వైదే:—మీరు దైవాన్నే ధిక్కరిస్తున్నారు !

ఇంది:—లేదు...ఆ దైవాన్ని ఉపయోగించి మీరందరూ చేసే యీ దుష్ప్రచారాన్ని, స్వలాభంకోసం మీరు అయుధంగా ఉపయోగించటాన్ని ధిక్కరిస్తున్నాను.

వైదే:—ఇందులో స్వలాభం ఏముంది ?

ఇంది:—ఒక వేళ ఇవాల్టి బహుమతి మీకేవొస్తే ?

వైదే:—అది నేనేమీ తినను. దేవాలయం కట్టించబోతున్నాను. మీలాంటి ఐశ్వర్యవంతుల్ని ఆశ్రయించి దేవుడికి మాన్యాలు యిప్పిస్తాను—

ఇంది:—మీ చేత దేవుడు సృష్టించబడ్డాడా ? దేవుడి చేత మీరు సృష్టించబడ్డారా ?

వైదే:—అదేమిటీ అట్లాఅంటారు ? దేవుడే మనను సృష్టించాడు; అందుకు సందేహమా ?

ఇంది:—అందుకని, ఆ దేవుడే మనకు ఏమన్నా ఇవ్వాలి కాని మనం ఆయనకు ఏమన్నా ఇవ్వటంలో అర్థం లేదు. దేవుడు తనకు తాను సంపాయించుకోలేని దద్దమ్మయి ఉండాలి; లేకుంటే ఆయనకోసం మనమేమీ సంపాయించక్కర్లేదు. అదీకాక, యీ విధంగా, ఆయన్ని ఏపనీ చెయ్యనీకుండా, సోమరిపోతుగా తయారు చేస్తున్నాం—

వైదే:—ఆ ఇవ్వటం మనభక్తిని చాటుతుంది.

ఇంది:—ఎవరికీ ? మిగతా ప్రజలకు !... తేలిగ్గా కీర్తి సంపాయించేందుకు ఇదొక యెత్తు.

దైవ—నేను అనేకమంది ధనవంతులదగ్గర చందాలు పోగు చేశాను కాని, మీలాగు ఘోరంగా ఎదురువాదనకు ఎవరూ దిగలేదు.

ఇంది:—వాదనకు కారణాలు దొరకొద్దూ? అసలు సంపాయించిన డబ్బే అన్యాయార్జితమాయె! అందులో కొంత పాపాన్ని పంచుకునేందుకు ఆ దేవుడే ఏజెంటుద్వారా తయారయ్యె! మాట్లాడకుండా పారేస్తే, నలుగురూ భక్తుడనన్నా చెప్పుకుంటారు. అదీకాక, పుణ్యం యీ రకంగానన్నా సంపాయించకపోతే, చచ్చాక నరకకూప మని భయపెట్టారాయె!

దైవ:—అంతమాత్రానికే వీళ్ళందరూ భయపడ్డారంటారా?

ఇంది:—ఎందుకు భయపడరూ? పైకి మేకపోతు గాంభీర్యాన్ని నటిస్తూనాన్నా, లోపలి కల్మషాత్మను యీ నరక కూపం భయపెట్టలేకపోతుందా? ఇంతా ఏడుస్తే యీ శాస్త్రులంచంతోనూ ఆభారం తగ్గించి తేలికమార్గం వొకటి కల్పించి కూర్చున్నారుకదా! తను పాపి అనే నమ్మకం లేనివాడికి అసలు దేవుడి ధ్యాసే అనవసరం! పోలీసువాణ్ని చూస్తే, దొంగకు భయం వుంటుంది కాని—అందరికీనా?

దైవ:—మేమంతా దొంగలమా?

ఇంది:—పొరపాటు బందిపోటు దొంగలు! పగటి చుక్కలు!...మనుషులకు ఉండేందుకు ఇళ్ళు లేక

పోయినా, దేవుడికి ఒక్కడికీమాత్రం గుళ్ళూ, గాలిగోపు రాలూ కావాలి. వీళ్ళకు తిండి లేకపోయినా, దేవుడికి మాత్రం మంగళహారతులూ, నిత్యనైవేద్యాలూ, కల్యాణాలూ, ఊరేగింపులూ, నాట్యాలూ జరిగితీరాలాయె! మీరు పోగుచేసిన చందాలు అసలు దేవుడిదాకా వెళ్తున్నయ్యా అని—

దైవ:—అంతమాట మానవమాత్రు లెవరూ నన్ను అనలేదు! అవ్వి దేవకార్యం కోసం పోగుచేసిన చందాలు. ఆ దేవుడే నన్నెప్పుడూ జమాఖర్చులు అడగలేదు; ఇంక వీళ్ళందరూ ఎవరూ కోన్కిస్కా గొట్టంగాళ్ళు?

ఇంది:—వాడికసలు లెఖ్ఖలు రావు; పోగుచెయ్యమని అడిగి ఏడ్చాడు కనుకనా, లెఖ్ఖలు చూపలేదని ఏడ్వేందుకు?...మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. కోపం రాదుకదా?

దైవ:—దైవభక్తులకు కోపం ఉండదు.

ఇంది:—కోపంతో సాగే వ్యాపారం కాదిది...సరే... మీరు ఎప్పుడన్నా గుర్రపుస్వారీ నేర్చుకున్నారా?

దైవ:...దానికీ దైవభక్తికీ సంబంధం ఏమిటీ?

ఇంది:—చెప్తానుగా, ముందు నాప్రశ్నకు జవాబు చెప్పిండి...

దైవ:—నేర్చుకున్నాను. నిజం చెప్పాల్సివొస్తే - చిన్నప్పుడు ఇసుక పర్రలమీద తిరుగులాడే కంచరగాడిదల మీద ఎక్కేవాణ్ని. కాని, వాటికి అదుపూ, ఆజ్ఞా లేక

పోవటంవల్ల, చెప్పినమాట వినక, వెనకకాళ్ళు ఎత్తి తంతూండేవి. ఎల్లాగో కష్టపడి ఎక్కి, రెండు దెబ్బలు వేస్తె, ముళ్ళకంచల్లోనో, సీసపు పెంకులమీదో పడే సేవి. ఇది లాభంలేదని గుర్రాలమీదికి దృష్టి సారించాను. కొంతమంది గుర్రబ్బళ్ళ సాయిబులు, గడ్డి కొనలేక, బక్కచిక్కిన తమగుర్రాల్ని ఊరిమీదపడి మేసి వొచ్చేందుకు వొదిలేవాళ్ళు. ఆరకం గుర్రాల్ని పట్టుకునేవాణ్ని. సరైన పోషణ లేకపోవటంవల్ల వాటివెన్నెముకలు గుచ్చుకుంటూండేవి. గోనెపట్టా వొకటి జీనుగా వేసినా అంత సుఖంగా ఉండేదికాదు. అట్లాగే అవస్థ పడుతూండగా, గుర్రం హఠాంచేసి, బలవంతానపైన ఎక్కాననే కోపం కొద్దీ గరుకైన గోడలకు పక్కగా వెళ్ళి, దేహాన్ని దానికేసి గట్టిగా రుద్దటం ప్రారంభించేది. దాని శరీరంమీది దురదతోపాటు నాశరీరంమీది సగభాగం దోక్కుపోవటం మొదలుపెట్టేది! వీటికన్న గాడిదలే మెరుగనిపించింది. ఏమైనా ఇక యీరకం జంతుజాలంతో శ్రమపడి లాభంలేదని, స్వారీ నేర్చుకోవటానికి పూర్తిగా స్వస్తిచెప్పాను—

ఇంది:—చెప్పి, ఆ బక్కచిక్కిన గుర్రాలకన్నా, గాడిదకన్నా సుఖంగా, తేలిగ్గా, స్వారీ చేసేందుకు మనుషులు వాటంగా ఉన్నారని కనిపెట్టారు! రెండుకాళ్ళ జంతువులకు పైన ఎక్కినవాణ్ని పడేసేపాటి ధైర్యంకూడా లేదాయె!

దైవ:—(కోపంగా) ఇందాకటినుంచీ ఏదోవిధంగా నచ్చ జెప్పి, చందా వేయిద్దామని ప్రయత్నిస్తూంటే - మీరు ఇంత చిన్నచూపుతో మాట్లాడటాన్ని వొదల్లేదు. అసలు నాస్తికవాదుల్తో ఇంతసేపు వాదించటం నాదే బుద్ధి తక్కువ —

ఇంది:—ఆ సంగతన్నా త్వరలో కనిపెట్ట గలిగారు!

దైవ—ఛీ! కలియుగం!...కలియుగం!

[ విసురుగా వెళ్లిపొయ్యాడు: క్షణం నిశ్శబ్దం. ఒక యువకుడు వొచ్చాడు. ఇరవై ఏళ్ళ వయస్సు. పైజామా, మోకాళ్ళదాటేచొక్కా— కాస్త మాసిన గడ్డమూను—.]

ఇంది:—తమకేం ఉద్యోగం?

యువ:—(కూర్చొని) ఉద్యోగం ఏమన్నావుంటే — అది నొదిలి ఇక్కడి కెందుకు వొస్తానూ?

ఇంది:—నిరుద్యోగులా?

యువ:—కాదు విద్యార్థిని!

ఇంది:—ఏం చదువుతున్నారూ?

యువ:—ప్రస్తుతం చదువేమీలేదు. రెండేళ్ళక్రితం బి.ఏ.లో రెండు పార్టుల్లో తప్పాను. సెప్టెంబరూ, మార్చి వరస్గా చూస్తూవొచ్చాను కాని — ఆ యూనివర్సిటీ వాళ్ళకు యీ దీనుడిమీద దయకలగలేదు. మొన్న మార్చ్‌లో డబ్బుల్లేక, పరీక్షఫీజుకూడా కట్టలేదు. అందుకని, నేను పాసయ్యేదాకా, విద్యార్థినేకదా?

ఇందిః—ఔను...జీవితాంతంవరకూ మీరు విద్యార్థులే!... ఇక్కడ ఉద్యోగాలు ఏమున్నయ్యని వొచ్చారూ?

యువః—వాంటెడ్ కాలమ్స్‌లో యీ బహుమానం విషయం వొక్కటే నాకు కాస్త సులువుగా కనిపించింది. మిగతా ఏ ఉద్యోగానికీ అర్హత ఉన్నట్టు నాకు తోచ లేదు.

ఇందిః—(జాలిగా) అందుకని వొచ్చారా? మీరు నాకేం సహాయం చెయ్యగలరూ?

యువః—షేక్స్పియరూ, మిల్టనూ, రస్కినూ, టెన్నిసన్నూ అప్పజెప్పగలను. వినాయక చవితి పద్యాలూ, దసరా పాటలూ, కాశీమజిలీలూ — చదివి పదవి భాగంతో అర్థతాత్పర్యాదుల్ని చెప్తూ నూరిపొయ్యగలను.

ఇందిః—పూర్వం నాకు నేనే నూరిపోసుకున్నాను.

యువః—కనుక, యీ ప్రక్రియ లాభం కాదన్నమాట? ఇందాకటినుంచీ ఆ ముసలాయన — అంటే, మీ నాన్న గారు, మిమ్మల్ని గూర్చి నాతో చెప్తున్నారు. నాకు ఇం కొక్క గొప్ప ఆలోచన తట్టింది.

ఇందిః—చెప్పండి.

యువః—నా దృష్టిలో లోకంలో రెండే రెండు పార్టీ లున్నయ్. మాంఛి ఆలోచన మీద కష్టపడి దీన్ని కనిపెట్టాను.

ఇంది:—రాజకీయాల్లోకి కూడా దిగారూ? ఇంకేం మీ నిర్మాణ కార్యక్రమమూ, ప్రణాళికా, విప్లవమూ, విశ్వ శాంతీ—ఇదంతా చెప్పటం మొదలు పెడితే ఇవ్వాళ అవుతుందా ?

యువ:—నా థియరీ అతి తేలిగ్గా రెండు మూడు మాటల్లో చెప్పెయ్య వొచ్చు. గ్రామఫోన్ హారన్ లూ లౌడ్ స్పీకర్లూ, జండాలూ, వాల్ పోస్టర్లూ, చివరకు ప్లాట్ ఫారం కూడా అక్కర్లేదు. అసలు నాది రాజకీయ దృక్పథం కూడా కాదు. సృష్టిరీత్యా ఏర్పర్చబడ్డ పార్టీలు –

ఇంది:—కానీండి ...

యువ:—మీాకు అరిటిపండు వొలిచి ఇచ్చినట్టు తేలిగ్గా అర్థ మౌతుంది. ఒకటి : మొగపార్టీ, రెండు : ఆడపార్టీ. ఇది వొక్క ఇండియాలో నేకాదు. గ్లోబుమొత్తానికి సరి పడేసత్యం. ఇహ లోకంలోమాత్రమే కాదు; పర లోకాల్లోకూడా ఇదేవ్యవహారం! నరకంలో యముడూ, చిత్రగుప్తుడూ మొగపార్టీ సభ్యులు. అలాగే స్వర్గంలో దేవేంద్రుడూ, బృహస్పతీ మొదలైనవాళ్ళు మొగపార్టీ వాళ్ళు. రంభ, ఊర్వశీ, శచీదేవి మొదలైనవాళ్ళు ఆడ పార్టీ సభ్యురాండ్రు! మనపార్టీ సభ్యులకు సభ్యత్వరుసుం లేనేలేదు! ఇంకా దూరం ఆలోచించండి; ఈ పార్టీ గొడవ ఒక్క మానవుల్లోనే కాదు. జంతువుల్లో

పక్షుల్లో, భూచరాల్లో, జలచరాల్లో, ఉభయచరాల్లోనే కాకుండా—చీమల్లో, దోమల్లో — చివరకు చెట్లల్లో, చేమల్లోకూడా నేను లోగడ పేర్కొన్న రెండుపార్టీలూ ఉన్నయ్. ఎక్కువ ప్రచారమూ, శ్రమాలేకుండానే పార్టీసభ్యులు వాళ్ళంతట వాళ్ళే ఏకమై—చెట్టాపట్టాలు వేసుకొని, జీవిత సాగరంలో బుడుంగ్ బుడుంగ్ మంటూ సుఖవుగా యీతకొట్టవొచ్చు.

ఇంది:—ఒక వేళ అబరువుకు మునిగేపోతే ?

యువ:—అప్పుడసలు యీదాల్సిన శ్రమకూడా అక్కర్లేదు. మరీ తేలికైతే ఎగిరెగిరి పడటమంటూ వుంటుంది. కాస్త భారంగా వుంటే—దూకుడుగా గోతుల్లోనూ, ప్రమాదాల్లోనూ పడకుండా, అతి సాఫీగా నడక సాగించ వొచ్చు.

ఇంది:—బాగానేవుంది.

యువ:—అందుకని, మీరు పెళ్ళిచేసుకోండి—.

ఇంది:—ఎవర్నీ ?

యువ:—ఒక మొగపార్టీ సభ్యుణ్ని; అంటే ఒక్క మొగ పురుగును ! ఐతే వయస్సులో మీకన్న చిన్నవాణ్ని ఏరుకోండి.

ఇంది:—ఎందుకని ?

యువ:—హిందూసమాజంలో వితంతువుల గోడు ఎక్కువ, అంధుకని, మీకన్న చిన్నవాణ్ని చేసుకుంటే — మీ

భర్తకన్న మీరే ముందుగా యీ లోకంనుంచి చల్లగా జారుకునే అవకాశం బాగావుంటుంది. అంటే ఇంకోరి వితంతువయ్యే ప్రమాదాన్ని చాలవరకూ దాటవొచ్చు-

ఇంది:—ఊహుం. ఇంకా ?

యువ:—నిరుద్యోగినీ, ఏఉద్యోగానికీ పనికిరాని వాణ్ణీ చూసి చేసుకోండి—.

ఇంది:—ఏం అలా అన్నారు ? నిరుద్యోగి భార్య నెలా పోషిస్తాడూ ?

యువ:—ఉద్యోగి ఉద్యోగాన్నే చూసుకుంటాడా ? భార్యానే చూసు కుంటాడా ? ఆ రెండింటికీ లంకె కుదరదు. ఒకవేళ భార్య మీద విసుగెత్తి కానీ, కోపం వొచ్చి కానీ, ఉద్యోగం కోసం వెతకటం ఆరంభించినా, ఏ ఉద్యోగానికీ పనికిరానివాడు కనుక, మళ్ళీ తిరిగి భార్య దగ్గరికే రాక తప్పదు !

ఇంది:—పోనీ ఆస్థి ఉన్నవాడైతే ?

యువ:—ఒద్దు...మీకు ఆస్తి లేకపోతేగా ? భర్తకే ఆస్థి వుంటే - భార్య బానిసవక తప్పదు. వాడికి ఆస్థి లేక పోతే చచ్చినట్టు ఇక్కడే పడి వుండి, మీ మాట వింటూంటాడు, మీ కన్న చిన్నవాడూ, అనుభవం తక్కువ వాడూ కనుక, మీ చెప్పుచేతల్లోనే మెలగు తూంటాడు.

ఇంది:—నిజమే ! నా మొదటి భర్త విషయంలో ఆ అను భవం వుంది.

యువ:—కాలేజీలో చదువు తూన్నవాణ్ని కానీ, ఇంతకు ముందే కాలేజీ వొదిలిన వాణ్ని కానీ ఏరుకోండి.

ఇంది:—ఏం అలా సెల విచ్చారు ?

యువ:—అలాటి వాడికి లోకజ్ఞానం శూన్యం! వాడికే లోకజ్ఞానం వుంటే - మీ మాట సాగనివ్వడు. వాడి కున్నపాటి విజ్ఞానంతో, నాయకత్వం గోలే వాడికి ఉండదు.

ఇంది:—నిజమే !

యువ:—చిన్నప్పుడు మీరు ఆటబొమ్మల్తో ఆడుకొని వుంటారు ఇప్పుడుకూడా అవ్వి మీ జీవితానందానికి అవసరం.

ఇంది:—అటకమీద ఉన్నయ్. దింపించి, బూజూ దుమ్మూ దులిపించమంటారా ?

యువ:—ఆ ప్రాణంలేని బొమ్మలింక లాభంలేదు, చిన్న తనపు అమాయకత్వంలో అవి చలామణీ అయినయ్. అందుకని, ప్రాణంవున్న బొమ్మ - అంటే, నేనుచెప్పిన రకం చిన్నసైజు భర్త -

ఇంది:—ఊహుఁ, తరువాత ?

యువ:—బంధువులు లేనివాడుగా, ఒంటరివాడుగా చూడండి.

ఇంది:—అందువల్ల ఏం లాభం ?

యువ:—మాటిమాటికీ ఆ బంధువులు మీయింటికి వొచ్చి వారాల పర్యంతం తిష్టవెయ్యరు. మీ ఆటవస్తువు

అంటే – మీభర్త మీకుఇచ్చే ఆనందంలో భాగాన్ని పంచుకోలేరు.

ఇంది:—మంచిదే! అలాటివాడి కోసం మళ్ళీ పత్రికలో ప్రకటన వెయ్యమంటారా?

యువ:—ఒద్దు. అదోదండగ. నేను చెప్పిన రకంవాళ్ళు దేశంనిండా కుప్పతిప్పలుగా పడివున్నారు. వాళ్ళందరూ ఇక్కడికి తయారైతే – మీరు గాభరాపడి, ఎవర్ని ఏరుకోవాలో తెలియక, తికమక పడతారు.

ఇంది:—మరి అలాటివాడు ఎక్కడ దొరికేట్టూ?

యువ:—(చేతులు నలుపుకుంటూ) నేనే!

ఇంది:—మీకేం ఆస్తివుందీ?

యువ:—ప్రస్తుతం ఏమీ లేదు. ఉన్నఆస్థి ఏదో చదువు కింద సరిపోయింది. ఆస్థి ఐపొయ్యాక, అప్పు ఇచ్చేవాడే కరవైనందువల్ల, అప్పూలేదు. అదీకాక, నేను మిమ్మల్ని వివాహమాడబోవటంలేదు కనుక, నాఆస్థి వివరాల్తో మీకు జోక్యంలేదు.

ఇంది:—మరి?

యువ:—మీరే నన్ను వివాహమాడబోతున్నారుగా!

ఇంది:—సరే...మనిద్దరిమధ్యా ప్రేమన్నా లేదుకదా?

యువ:—క్రమంగా పుడతుంది. ఉన్నప్రేమంతా ఇప్పటి కిప్పుడే పుట్టుకొస్తే—ఇక త్వరత్వరగా ఖర్చయిపోతుంది. అందుకని, తీరిగ్గా వొచ్చి, తీరిగ్గా పొయ్యే ప్రేమ చాలా కాలం వుంటుంది—

ఇంది:—ఇదీ ఉపాయంగానే ఉన్నట్టుంది. మరి పెళ్ళయ్యాక, మీరు ఎప్పుడూ ఇక్కడే ఉంటారా ?

యువ:—మీరు వొదలమన్నా వొదలను. బైటి ప్రపంచం అతిఘోరంగా, బాధాకరంగా వుంటుందని అర్థమైంది. అందుకని యీ ప్రహరీ గోడల్ని దాటిపోను. కొంత మంది బంధువుల్ని అవసరంకొద్దీ నేనే వొదులుకున్నాను; మిగతావాళ్ళు నన్ను వొదిలిపెట్టారు. నేను ఒంటరివాణ్ని. కనుక ఇంక ఎక్కడికివెళ్తానూ? వెళ్ళినా, భూమి గుండ్రంగా వుంటుందనే భూగోళ న్యాయప్రకారం—మళ్ళీ ఇక్కడికే తిరిగివొస్తాను.

ఇంది:—నామాటవింటూ, నామీద అధికారాన్ని చలాయించకుండా వుంటారా ?

యువ:—నాకసలు అధికారమంటే తెలిసి ఏడిస్తేగా—చెలాయించేందుకు ? ఒకవేళ మీరు నాకాఅధికారాన్ని అంటగట్టినా, దాన్ని నిలబెట్టుకునేమార్గమూ, సక్రమంగా ఉపయోగించుకునే విధానమూ, నేను చదివిన పుస్తకాల్లో ఎక్కడా తగల్లేదు.

ఇంది:—బాగుంది...ఉండండి...మానాన్నను పిలుస్తాను—

[ఇందిరాదేవి వెళ్ళింది. క్షణంనిశ్శబ్దం. ఆమె తండ్రితోపాటు తిరిగి వొచ్చింది.]

యువ:—నాన్నా ! వీరు నాకు చికిత్సచెప్పేశారు—

రామ:—ఓహో! ఇంత చిన్నవయస్సులో ఇంత తెలివి తేటలు—

ఇంది:— తెలివీకాదు; దానిమీద తేటాకాదు లే!

రామ:—ఏమైతేనేంలే!—వీరికి బహుమానం ఇచ్చి పంపు దామా?

ఇంది:—బహుమానం ఇవ్వక్కర్లేదు.

యువ:—ఔను! ఆస్థిలో భాగమంటూ నాకు పనికిరాదు. ఎందుకంటే, ఇవ్వాల్టినుంచీ, నేనుకూడా మీఆస్థిలో ఒక భాగాన్నే!

రామ:—నాకు అర్థమవలేదు.

ఇంది:—ఆయన చెప్పిన చికిత్సప్రకారం, ఇకనుంచీ ఎప్పటికీ ఆయన ఇక్కడే వుంటాడు—

రామ:—ఇక్కడా? ఇక్కడ ఏంచేస్తూంటాడూ?

ఇంది:—మీకు అల్లుడై వుంటాడు—

రామ:—(బుర్రఆడించి) అదా చికిత్స?

యువ:—(చిటికవేసి) ఊఁ అదే స్వామీ!

రామ:—(ఇందిరవైపు తిరిగి) మంచిది!

[ అందరూ నవ్వారు ]

: తెర :

—జనవరి, 1946

# ఉల్టా - సీదా

[ అపరిశుభ్రమైన చిన్నగది. గోడలకు వేళ్ళాడే బూజూ, గదిమూలల్లో కాల్చిపారేసిన బీడీపీకలూ, చేతులు విరిగిన రెండు కుర్చీలూ - ఇది బ్రహ్మచార్లు నివశించే స్థలమని, రూపిస్తున్నయ్.

టేబిల్ మీది టైంపీస్ ఐదుగంటల్ని సూచిస్తోంది. గదిలోకి పడే నీరెండను పట్టి ఇది సాయంత్రమని గ్రహించవొచ్చు. టేబిల్ మీద పరిచివున్న గుడ్డ చాలాకాలం చాకిరేవు కోసం ఎదురు చూసి చూసీ, ఇక నిరాశతో వృద్ధాప్యాన్ని ఎదుర్కొంటోంది; ఆ గుడ్డ రంగును మనం నిర్ణయించ లేకపోవొచ్చు. మూల వున్న పాతట్రంకు పైభాగాన్ని చాలా వరకు తుప్పు తన పొట్టను పెట్టుకుంది.

రెండు చింకి చాపలు గది మధ్యలో పరచ బడి వున్నయ్. ఇద్దరు యువకులు పేకాట ఆడుతున్నారు. వాళ్ళు కట్టుకున్న గళ్ళలుంగీల్ని బట్టి ఇది ముస్లింలీగ్ వ్యవహారమని మనం పొరబడ వొచ్చు. ఇద్దరి వయస్సూ దాదాపు ఒకటే—ఒక పావు శతాబ్దం.

మూర్తి పంచర్లుబడ్డ కాలర్ బనీను ధరించాడు. దాసువిషయం ఎక్కువేమీ లేదు. జులపాలైతే పెంచాడుకాని, ఆ పని కావాలని చేశాడో, లేక మంగలిఖర్చు ఆదాచేద్దామని చేశాడో తెలియటం లేదు. ]

మూర్తి:—(పేకముక్క విసిరికొట్టి) అట్లారా...దిగు!

దాసు:—ముక్కలు చిరుగుతే కొత్తపేక కొనేందుకు డబ్బిల్లేవు, (కాస్త ఆలోచించి, ముక్కఎత్తి, మళ్ళీదింపి, చివరకు గుండెరాయి చేసుకున్నవాడల్లే ముక్కవేసి) ఊఁ రానీ—

మూర్తి:—(నిరాశతో ఆత్రుతగాచూసి) చంపావే! (బీడీ పీల్చి, ఆరిపోనటంవల్ల అవతల పారేసి) బీడీ వాక టివ్వు—

దాసు:—లేవు.

మూర్తి:—పోసీ అగ్గిపెట్టె...అరె! బీడీ పారేశానే!

దాసు:—పోయి ఏరుకో.

మూర్తి:—ఆ గుట్టలో ఎక్కడ పడ్డదో! అందులో వారం రోజులనాటి మురుగుడు సరుక్కూడా వుంది.

[శర్మ వొచ్చాడు. అతనివాలకంచూస్తే మిగతా ఇద్దరం చెడిపో లేదనిపిస్తుంది. ఇరవైరెండేండ్లవయస్సు. విశాలమైన ఫాలభాగం. అంద మైన కళ్ళు, అతనిలోని ఏ 'ఫీలింగ్' నూ దాచలేవు, ఏదోవిషయంతో బాధపడుతూన్నట్టు కనిపిస్తున్నాడు]

మూర్తి:—రా...బ్రదర్! చాలాఆలశ్యంగా చేశావే! ఒక సిగరెట్ ఇలాపారెయ్!

శర్మ:—కొనటం మరిచిపోయ్యా ... నా గోలలో అన్నీ మరిచే పోతున్నా.

మూర్తి:—(పేకముక్కలు కిందికిదింపుతూ) ఏంగోలా? (తలఎత్తిచూచి) అరె అట్లావున్నావేం?

దాసు:—మళ్ళీ ఏం ఉపద్రవంవొచ్చింది?

మూర్తి:—ముందుకూర్చో -

శర్మ:—(కుర్చీలోకూలబడి) ఉస్! (నిట్టూర్చాడు)

దాసు:—విసిరి సపర్యలు చెయ్యమంటావా ? అసలు సంగ తేమిటీ ?

శర్మ:—మామూలుగోలే ! మళ్ళీ పెళ్ళి మాటలు !

మూర్తి:— మాకు పప్పన్నాలన్నమాట !

దాసు:—ఇదివరకు డజనుసార్లు డిసప్పాయింట్ చేశావ్ !

మూర్తి:—కనుక యీసారి తప్పకుండా చేసుకోవాలి.

శర్మ:—పిల్లికి చెలగాటం, ఎలుక్కి ప్రాణసంకటంలాగుంది !

మూర్తి:—ఏం—ఏమొచ్చిందీ ?

శర్మ:—ఈ పెళ్ళి నాకు ఇష్టంలేదు.

దాసు:—ఇది మామూలుపదమే ! ముందు ఇష్టంలేక పోయినా, తరువాత ఇష్టం దానంతట అదే పుడుతుంది. ఈసారి కారణాలేమిటీ ? పిల్ల బాగుండదా ?

శర్మ:—పిల్లను చూడలేదుకాని, చూచినవాళ్లు అప్సరసని చెప్తున్నారు.

(ఫొటోతీసి ఇస్తూ) చూడు—

మూర్తి: దాసు:—(ఒకరి తలమీదించి ఇంకోళ్లు చూస్తూ) ఫిలిం స్టార్ లాగుందే !

దాసు:—భలే పిల్ల!

మూర్తి:—వేచి కూర్చున్నందుకు మాంఛీ ఛాన్సు!

శర్మ:—నాకు వొద్దురాబాబూ అంటే?

దాసు:—అన్నట్టు మొదటి పానిపట్ యుద్ధానికి కారణా ల్లాగు నీ మిగతా కారణాల్ని ఏకరువు పెట్టు—

శర్మ:—అసలు పెళ్ళంటే నాకు భయం—

దాసు:—ఆ భయాన్ని చాలాభాగం మేం పోగొడతాం; ఇంకా అడుగూ బొడుగూ ఏమన్నా వుంటే, ఆకాస్తా పెళ్ళికూతురే పోగొడుతుంది!

శర్మ:—అది పోగలదు. ఈ యీడులో నేను పెళ్ళాడదలుచుకోలేదు.

దాసు:—మరి నువ్వు ముసలాడి వయ్యాక, నిన్నెవతె పెళ్ళాడుతుందీ?

శర్మ:—పోనీ ఇలాగే వుంటాను.

మూర్తి:—అపర భీష్ముడు! (నవ్వాడు)

శర్మ:—నవ్వులు సరేనోయ్...ముందు నేను బైట పడే మార్గం చూడండిరా!

మూర్తి:—నువ్వింకా నీ ఒప్పుదలను ఇవ్వలేదుగా?

శర్మ:—ఇవ్వలేదు ఆ కాబోయ్యేమామ ఉదయానే దిగాడు. ఒక వైస్రాయి వొచ్చినంత వైభవంగా జరిగింది. పొద్దుట్నుంచీ అమ్మా, నాన్నా వరసాగ్గా వొచ్చి యీ పెళ్ళి ఒప్పుకోమని ఒకటే తోముతున్నారు. చివరకు నాన్నతో పోట్లాడాల్సి కూడా వొచ్చింది; రేపు ఉదయం లోపల నా ఒప్పుదలను ఇవ్వకపోతే నాకిక ఆ ఇంట్లో చోటులేదన్నాడు. కొన్నాళ్ళపాటు ఏ దేశాంతర మన్నా పోదామని చూస్తున్నాను.

దాసు:—ఖిూ నాన్నకు అంత పట్టుదలేం!

శర్మ:—పెద్ద ఆస్థి ఒక్కతే కూతురు, కట్నం యేమీ తీసుకోకపోయినా, ఉత్తరోత్రా ఆ ఆస్థంతా కలుస్తుందనే నమ్మకం వుంది.

దాసు:—ఇంకేరా — ఇంతకన్న మంచిపిల్ల యీ జన్మలో దొరకదు!

మూర్తి:—చదువుకుందా? ఏమన్నా పాడగలదా?

శర్మ:—ఈ సంవత్సరం స్కూల్ఫైనల్ ప్యాసయిందట అద్భుతంగా పాడగలదట గ్రామఫోన్ కంపెనీవాళ్ళు రికార్డింగ్ కోసం వెంటపడ్డా—వాళ్ళు ఒప్పుకోలేదట.

దాసు:—అన్నీ గొప్పగుణాలే! రేపు నువ్వు డాక్టరువై—రోగుల్ని ఒక రోకటుగా దారిద్ర్యాటంలో నిమగ్నుడివైనా—సంగీతంతో సంపాయించగల భార్య ఉంటుందామె! అబ్బాయీ! పొరపాటున వాళ్ళు నీకు యీపిల్లను ఇస్తామన్నారు, సమయందాటుతే, నువ్వు ఎదురిచ్చినా ఇంత మంచి సంబంధం దొరకదు. ఇప్పుడు నువ్వు ఒప్పుకోకపోవటం—నీ దేలోపం!

శర్మ.—ఏం పెళ్ళిరా! ఆ పిల్ల ముక్కూ మొహమన్నా ఎరగను. చివరకు ఆ అమ్మాయివి కలలో చూసినపాపానన్నా పోలేదు. పూర్వపరిచయం ఏమీ లేకుండా యీ పెళ్ళి చేసుకొని నేను సుఖపడేదేమిటి?

దాసు:—పెళ్ళి విషయంలో జార్జిబెర్నాడ్షా ఏమన్నాడో విను: పరిచయమున్నూ, స్నేహమూ, ప్రేమా వృద్ధయ్యాక,

ఏరికోరి చేసుకున్న వివాహాలతో ఎంతమంది దాంపత్య సుఖాన్ని అనుభవిస్తున్నారో — లాటరీ పద్ధతి మీద జరిగే వివాహాలతో కూడా అంతేమంది దాంపత్య సుఖాన్ని అనుభవించ గలుగుతారు —

మూర్తి:—ఇది నాకు కాచివడబోసిన సత్యంగా కనిపిస్తోంది. మచ్చుకు - శర్మ జీవితాన్నే తీసుకుందాం. పూర్వం శర్మ సుభద్రతో స్నేహంచేసి అత్యాత్మగా ప్రేమించి ఊరుకున్నాడు ఏ కారణాన్నయితేనేం ఆమె వివాహం శర్మతో కాకుండా జరిగిపోయింది. మనవాడు మనస్సు చెడగొట్టుకొని, ఇంకా 'సుభద్రా! సుభద్రా!' అని అప్పు డప్పుడు కలవరిస్తూన్నా, ఆమె మాత్రం ముక్కూ, మొహమూ ఎరుగని ఆ భర్తతో లక్షణంగా కాపరంచేస్తూ, అప్పుడే ఇద్దరు బిడ్డల తల్లయింది. ఆమె కలలోనన్నా శర్మను తలుస్తోందనే నమ్మకం నాకు లేదు—

దాసు:—ఇంకోతమాషా ఏమిటంటే — ఈ ప్రేమరోగం మొదట్లో చాలా ఘోరంగా వెంటబడుతుంది. అప్పుడు నువ్వు ఏమనుకుంటావంటే—హృదయం అనేది తాతా ఐరన్ కంపెనీలో తయారు కాబడ్డ ఉక్కు కడ్డీఅనీ, దాన్ని నీ మొదటి ప్రియురాలి హృదయం అనే అయస్కాంతం తప్ప ఇంకోటేదీ ఆకర్షించలేదనీ పొరబడతావ్. కాని కాలక్రమాన, ఇతర స్త్రీల హృదయాలు—

అంటే ఇతర సూదంటురాళ్ళుకూడా నీ ఉక్కు—హృద యాన్ని ఆకర్షించగలవు. హృదయం అనేది లొంగని గట్టి పదార్థంతో చేయబడ్డ వస్తువు కాదనీ, అది.రక్త మాంసాలతో తయారుకాబడి అటూ ఇటూ తిరిగే అవకాశంవున్న లీవర్ మీద వేలాడుతోందనీ—యీ అను భవంతో నువ్వు తెలుసుకోవాలి.

మూర్తి:—కనుక ప్రేమించిన యువతితో నీ పెళ్ళవలేదని దిగులు పడనక్కర్లేదు. ప్రేమించగానే సరా ? సుభద్ర విషయంలో లాగు పెళ్ళికాకపోవచ్చు. అందుకు ముందు పెళ్ళాడేసి, తెగని సంబంధాన్ని మెళ్ళో వేసుకున్నాక, ప్రేమించటం మొదలెడితే—మరోరకం డిసప్పాయింట్ మెంట్ వుండదు—

శర్మ:—ఏమిటీ తోముడు ? ఇది తప్పించుకోవటం ఎట్లా గురా బాబూ అని ఆలోచిస్తూన్న నాకు యీ గొడ వంతా దేనికీ ? అమ్మకూ, నాన్నకూ పట్టినపిచ్చే మీకూ పట్టినట్టుంది. చూడబోతే—మీరంతా ఆ మామగాడి ఏజెంట్లులాగున్నారు ?

మూర్తి:—అక్కర్లేదనే వాడికే ఇంత మంచిఛాన్సు వొస్తూం టుంది. అదే ఆఫర్ నాకువొస్తేనా, ఎగిరి గంతేసి, పల్ల కీలో దూకేవాణ్ని.

దాసు:—(ఫ్రెంచికట్టుమీసం మెలేసి) నేనిక్కడ వుండగా, సీదాకా రానిస్తానట్రా ?

మూర్తి:—నువ్వు నాకన్న ఏవిషయంలో గొప్పా?
దాసు:—నేను కథకుణ్ని!
మూర్తి:—బోడికథలు! కాగితం దొరక్క నేను రాయటం లేదుకాని—
దాసు:—నేను రసికుణ్ని!
మూర్తి:—నేను కాకపోతేగా?
దాసు:—నేను రూపవంతుణ్ని, బలిష్ఠుణ్ని—
మూర్తి:—డబ్బుల్లేక, టాయిలెట్ సామాన్లు కొనటం లేదు కాని, నేనూ రూపవంతుణ్నే ప్రస్తుత ఆర్థిక సమస్య వల్ల కండ తక్కువై, ఇలావున్నానుకాని, మూడు నెల్లు తయారుచేస్తే — నేనూ వస్తాదులాగు తయారవకపోను! పోనీ నీకు యీ రెండు మూడు రకాల క్వాలిఫికేషన్సు ఎక్స్ట్రాగా ఉన్నయ్ కనుక — నీకు ఇంకో మంచిఛాన్సు ఇంకెక్కడన్నా దొరుకుతుంది. అందుకని యీ ఛాన్సు నేనే పుచ్చుకుంటాను.
దాసు:—అట్లా దారికిరా ఇప్పుడు మనిద్దరం రాజీపడదాం.
మూర్తి:—(వేళ్ళు చాపమీద మోగించి) టరమ్స్?
దాసు:—ఏముందీ? శర్మబేరం ముందు చెడగొడదాం. ఆ తరువాత మనిద్దరం స్వయంవరానికి వెళ్దాం. ఇద్దర్లో — ఆ అమ్మాయి ఎవర్ని పెళ్ళాడినా, వాడు, రెండోవాడికి నెలకు రెండువందలరూపాయిలవంతున, జీవితాంతము వరకూ, భరణం ఇచ్చుకోవాలి. మననిరుద్యోగసమస్యా, ఆర్థికపరిస్థితీ, యీవిధంగా తీరిపోతుంది.

మూర్తి:—ప్లాను చాలాబాగుంది. శర్మ మనకు రికమండ్ చెయ్యకపోతాడూ ?

శర్మ:—ఓ. తప్పకుండా !

దాసు:—సరే. నీకు యీసంబంధం చెడగొట్టే విషయం మీద రేపు మంచిప్లాను ఇస్తాను.

శర్మ:—రేపటిదాకానా ? ఒప్పుదలను తీసుకొని, రేపు పొద్దున్నే నన్ను పెళ్ళికొడుకును చేసేందుకు సిద్ధంగా వున్నారు. మామగారు ఇంటిదగ్గరే బిఛాణావరిచాడు.

మూర్తి:—రాత్రికి గోలచేసి, దెయ్యాలున్నయ్యని బెదర గొడితే ?

శర్మ:—ఆయన దయ్యాలమంత్రగాడట; పెద్ద వస్తాదులా గుంటాడు. దుడ్డుకర్రతీసుకొని వెంటపడి మన వీపులు విమానంమోత పుట్టేదాకా వొదలడు.

దాసు:—ఉండరా—

(కాస్త ఆలోచించి)అరేయ్! భలే ఉపాయం తట్టింది. క్షణాలమీద పని పూర్తవుతుంది...కాని, పని కాగానే మామగాణ్ని ఇక్కడికి తోలాలిసుమా !

శర్మ:—అట్లాగే !

దాసు:—ఐతే విను; మీ మామ రాత్రికి ఎక్కడ పడు కుంటాడూ ?

శర్మ:—మేడమీద; నా స్టడీరూంలో.

దాసు:—అర్ధరాత్రి నువ్వు ఆగదిలోకి జొరబడు—

శర్మ:—నా పక్క కిందవేస్తాడు.

దాసు:—చస్తార్లే...ఏం వేస్తే? ఆయన గదిలోకివెళ్ళి లైట్ వెయ్యి...వెళ్లేముందు తూకంగా తాగెయ్.

శర్మ:—అది నాకు అలవాటులేని మేళాం. తాగాక వాంతులు తగులుకుంటయ్!

దాసు:—మరి ఎట్లాగురా? సరే-ఒకపనిచెయ్. నోరన్నావాసి నెయ్యకపోతే లాభంలేదు కనుక, ఒక్క గుక్కెడు కాస్సేపు నోట్లోవుంచుకొని, పుక్కిలించి ఉమ్మెయ్. నీకు తాగే అలవాటు బాగావుందని తెలియజేసేందుకు ఒక బ్రాందీబుడ్డి చంకన పెట్టుకో. సిగరెట్ పీలుస్తూ, తూలుతూ వెళ్ళి ఆయన పక్కమీద కూలబడి, "శ్యామలా! శ్యామలా!" అని ఆయన్ను లేపు—

శర్మ:—శ్యామల ఎవరూ?

దాసు:—నీఊహా ప్రపంచంలోని ఉంపుడుకత్తె అనుకో! నీకేదో నిషాఎక్కి ఇదంతా వాగేస్తున్నావని ఆయన అనుకోవాలి. నీ చరిత్ర ఇండియన్ హిస్టరీలో ఇంకా చేర్చబడలేదు కనుక, నీకు నువ్వే చెప్పెయ్. ఏక్షన్ చేస్తూ నీ నోటికొచ్చిన అపభ్రంశం అంతా వాగెయ్. ఆయన ఇదంతా నిజమనుకొని, అదిరి, ఇంకెవ్వరితోనూ చెప్పకుండా తెల్లవారుజాము మెయిల్ ఎక్కుతాడు. రేపుపొద్దున నువ్వు నీ ఒప్పుదలను ఇచ్చినా - వాళ్ళంతట వాళ్ళే వెనక్కుపోతారు కనుక, నీ మీద సొడ్డేమీ వుండదు.

మూర్తి:—మామగాడు మెయిల్‌కు వెళ్తే మన అప్లికేషన్లు ఎట్లా? పోస్టులో పంపుకుందామా?

దాసు:—ఈ చలికి బిగుసుకొని ఐస్ ఐపోకుండా, శాలువలు ముసుగేసుకొని, స్టేషన్‌లోనే కాపలా వేద్దాం.

శర్మ:—భలే ఉపాయంరా దాసూ! మరి బ్రాందీబుడ్డి ఏదీ?

దాసు:—(ట్రంకులోని బుడ్డిని ఇస్తూ) బ్రదర్! జాగర్త రోయ్! అసలే దొరకటంలేదు, బ్లాకు మార్కెట్‌లో పాతిక రూపాయిలకు కొన్నాను. తూలేప్పుడు బుడ్డి వొదిలేవ్! రేపు పొద్దున్నే బుడ్డి మళ్ళీ నాకు జేర్చాలి సుమా!

శర్మ:—నా ఎత్తు బంగారం ఇచ్చినా నేను తాగలేనుగా!

దాసు:—నటించేప్పుడు జాగ్రర్త. ఒళ్ళు తెలియని స్థితిలో పడిపోతూన్నట్టుండాలి. నువ్వు రాసిందీ, ఇంకా ఇతరులవీ గేయకవిత్వమంతా అప్పజెప్పు - భలేపని చేస్తుంది. మామగాడు నిన్ను పట్టుకోలేక చస్తాడు!

శర్మ:—(కళ్ళు సగంమూసి అటూ ఇటూ తూలుతూ)

(గేయం)

ఈ వూరొక లంక
మన ప్రేమొక డొంక
నువ్వుచూస్తే నా వొంక
పడితే వొదలని బంక!

బంక!...బంక!...బంక!

[ శర్మ నాట్య చేస్తూ గదంతా తిరుగుతున్నాడు ]

మూర్తి:—హియర్!...హియర్!... నీ కవిత్వ పాకంలోని బంక - చాలేను, చాలకపొయ్యేను. ఇక్కణ్ణుంచే, ఇంత తుమ్మబంక తీసుకెళ్ళి మామగాడి మొహానికేసి పులుము.

దాసు:—అట్లా...రోడ్డుమీద తూలేవ్! పోలీసువాడు స్టేషన్‌కు జేరుస్తాడు.

శర్మ:—రైట్ ... నేను వొస్తాను.

[ శర్మ వెళ్లిపొయ్యాడు ]

మూర్తి:—ఇంతకూ మన ఆర్థికసమస్య తీరినట్టే!

దాసు:—ఉండరా ... ఇదివరలో

(రాగంతో) అనగా, ఆన పంధొమ్మిది వందలనలభై వొకటో సంవత్సరం, ఫిబ్రవరినెల ఇరవై మూడో తారీకు మొదలూ, యీ నాటివరకూ రాసిన ఐదు ఫిలింకథల్లోనూ. ఒక్కదాన్నన్నా నేనే డైరెక్ట్‌చేసి, వెండి తెరకు ఎక్కించాలి.

మూర్తి:—ఆడబ్బు నాచేతుల్లోకే రావాలి కాని - పది ఫిలింకథలు - రాసేస్తాన్, గీకేసాన్, తీసేస్తాన్! తీసి వెధవ వెండి తెరకు కాకుండా, బంగారపు తెర మీదికి ఎక్కిస్తాన్! పాకిస్తాన్! తోలేస్తాన్!

దాసు:—ఏడిశావ్ ! ప్రతి విషయంలోనూ యీ దేశంలో పోటీయే; వెధవ పోటీ !

[ తెర ]

## 2

[మేడమీది శర్మ స్టడీరూం. అంధకారబంధురం. టైం - పీస్, టక్-టిక్ లకు లయగా నిద్రపొయ్యే వ్యక్తి గురకతప్ప, ఇంకేఇతరశబ్దమూ వినరావటంలేదు.

స్విచ్ వేయగానే లైట్ వెలిగింది. గడియారం ఇంతకుముందే ఒంటిగంట దాటింది.

టేబిల్ మీద పుస్తకాలు చక్కగా అమర్చబడినయ్. ఒకమూల పందిరిమంచంవుంది. మంచానికి దోమతెర దించబడివుంది. లోపల గాఢనిద్రలో గురకపెట్టే స్థూలకాయుడు శర్మకు కాబొయ్యే మామగారు (?)

శర్మ క్రోధంతా రేగివుంది. కళ్ళునలపటంవల్ల కొద్దిగా ఎర్రబడ్డవి. మనిషి హైరానైనట్టు కనిపిస్తుంది. చేతిలోని సగం కాలిన సిగరెట్టు పొగలు విరజిమ్ముతోంది. చంకలో బ్రాందీబుడ్డివుంది. తూలుతూ తూలుతూ మంచందాకావొచ్చి, నిద్రించేవ్యక్తిని చూస్తూ ఒక్కక్షణం నిలబడిపొయ్యాడు. వెంటనే కర్తవ్యం నిర్ణయించుకున్నవాడల్లే, దోమతెరల్ని బలంగా లాగిపారేసి, దభీమని మంచంమీద కూలబడ్డాడు.]

మామ:—(ఉలిక్కిపడి లేస్తూ) దొంగలు !...దొంగలు !

శర్మ:—ప్యారీ ! దొంగను కాదే ! నీమానస చోరుణ్ణి !

మామ:—(నిద్రకళ్ళను తుడుచుకొని) ఓహో ! మీరా ?

సుగంధం వెదజల్లే మల్లీ !
నీముస్తాబే ఊసరవిల్లీ ! ! !

మామ:—సినిమా తారలమీదకూడా కవిత్వం రాశేవే ?

శర్మ:—ఆగేయ్ - ఆమె మొదటిచిత్రం విడుదలైన రాత్రి పదకొండు గంటల ముప్ఫై మూడున్నర నిమిషాలకు రాసి, ఆమె పాదపద్మముల ముందు ఇలా విసిరి అంకితం పారేశాను !

(కొత్తఉపాయం తట్టినవాడిలాగు)

ఉండు...ఇదిగో ! బుడ్డి !...మేరాబుడ్డి !

(చంకలోని బుడ్డి పైకి లాగాడు)

మామ:—బుడ్డికూడా తెచ్చావ్ ! నోటివాసన్నుపట్టి, ఇది మంచిరకం సరుకని అప్పుడే ఊహించాలే ! ఇంట్లో మీా ఆచారాలుచూసి, సౌత్ ఆఫ్రికా సరు కను కున్నాను కాని, నీ నాగరికతా, వ్యవహారమూ చూస్తే, సీమకు ఎగుమతి కావాల్సిన వాడివనే నమ్మకం కుది రింది...ఏదీ — బుడ్డి ?

శర్మ:—ఉండు...చుక్క వెయ్యనీ.

మామ:—(బుడ్డి లాక్కుంటూ) ఇటివ్వు - నేనూ వేస్తాను. డాక్టరీ చదువు తున్నందుకు, యీా ద్రవ పదార్థపు మెడిసినల్ వాల్యూను మహాబాగా కనిపెట్టావ్. పచ్చి బాలింతరాళ్ళకూడా ఇవ్వదగిన పరమౌషధం !

(సంతోషంతో బుడ్డి తిప్పిచూసి) అరె ! భలే సరుకే ! ఈ మాదిర్కా సరుకును రుచి చూసి మూడేళ్ళయింది. ప్రస్తుతం ఇది మిలిటరీకి తప్ప సివిల్ సప్లయ్ లేనేలేదు. బ్లాక్ మార్కెట్‌లో పట్టి వుంటావులే ! ఈ వూళ్ళో యీ షాపు ఎక్కడో నస సాయింత్రమంతా వెతు కుతూ తిరగలేక చచ్చాను. వెధవలు ఎక్కడో సందు గొందుల్లోనో, ఊరిబైటనో పెట్టినట్టున్నారు. ఈ రాత్రికి నిరాశతోనే పడుకోవాల్సి వొచ్చింది; అట్టి ఆపత్ సమయంలో సరిగ్గా సమయానికి ఇలా దింపాలి – తాజా సరుకు !

[ మామ సంతోషంతో సగంబుడ్డి తాగేశాడు ]

శర్మ:—(ఎలక్ట్రిక్ షాక్ తగిలిన వాడిలాగు వెనక్కి ముడుచుకొని) మాలతీ!

మామ:—నువ్వు చెప్పే పేర్లయితే నాజూగ్గా మహా బాగున్నయ్ కాని, మనుషులు ఎలా వుంటారా అని ఆలోచిస్తున్నాను. ఒక తెనన్నా యీ రాత్రి ఇక్కడికి శాంపిల్‌గా దింపినట్టయితే, విషయాన్నీ, నీ అభిరుచినీ బాగా అర్థం చేసుకునేవాణ్ని.

శర్మ:—(మోకరించి) ఈ లోకంలో నాకు నువ్వుతప్ప ఇంకేం వుంది?

మామ:—బుడ్డిలో ఇంకా ద్రావకం వుందిగా? పద్యం పాడు; లావొక్కింతయు లేదు......!

శర్మ:—మా ప్యారీకి బుర్ర తిరుగుతోందే!...హ్హి...హ్హి...హ్హి...!

మామ:—ఇలాటిబుడ్లు ఏక్ దమ్మున రెండేసి బిగించే అలవాటున్న నాకు బుర్రతిరగటమేమిటీ? ఈ భూమే తిరగంగా లేండ్, బుర్ర లేమిటీ — మనుషులూ, పొలాలూ, రైళ్ళూ, మేడలూ పర్వతాలూ, సముద్రాలూ, సాహిత్యాలూ—అన్నీ తిరుగుతూనే ఉన్నాయ్ అద్దంలేందే నీ బుర్ర నీకు కనిపించదు కనుక — మిగతా అందరి బుర్రలూ తిరుగుతూన్నట్టు కనిపిస్తూంటుంది. జాగ్రత్తీ చదవలేదట్రా - ప్రజాకథీ!

శర్మ:—భలే ఉషార్ గావుందే - యీ రాత్రి?

[ శర్మ మామను కౌగలించుకున్నాడు ]

మామ:—(కాస్త దూరంగా జరిగి) ఏరోయ్! నాకసలు మొగశరీరం తగుల్తే గొంగళీపురుగులు ఒళ్ళంతా పాకినట్టుంటుంది! దూరంగా జరుగు ముందు...

[ చెయ్యి విసిరి సూచించాడు ]

శర్మ:—(సందుదొరికిందని మామవైపు జరుగుతూ) ప్యారీ—ఏదీ ఒక్కముద్దు!

12

మామ:—(శర్మనువొంచి వీపుమీద ఒక్కగుద్దుబనాయించి) ఈ వీశగుద్దుతో నీ నిషాగిషా దిగిపోవాలి. దిగకపోతే ఇంకొక్కటి సరిపోతుందనుకుంటా—

శర్మ:—(ఆవలించి) అమ్మా!

(బలవంతాన తెప్పరిల్లి) అల్లాకోపంచేస్తే ఎల్లాగే పిల్లా?

మామ:—గుద్దింది అల్లా కాదు; నేనురా!

(మీసంతిప్పాడు)

శర్మ:—పిల్లా! మీసంకూడా పెంచావే!

మామ:—(మళ్ళీ మీసం తిప్పి)

(గేయం)

నీకోసంరా - యీమీసం
వినరా - నా సందేశం
ఇప్పుడు నా కొచ్చిన - ఆవేశం
నీ వీపుకు చాలా మోసం!

శర్మ:—ఆసుకవిత్వం కూడా చెప్తున్నావే పిల్లా!

మామ:—తెలుగులో కవిత్వం చెప్పలేనంత దద్దమ్మ ననుకున్నావా? అందులోనూ ఆసుకవిత్వాన్నిగూర్చి రెండు ముక్కలు బోధిస్తాను. జాగర్తగా విను; పేకముక్కల్లో ఆసు ఎంత గొప్పదో, కవిత్వంలో కూడా ఆసుకవిత్వం అంత గొప్పది; దాని తరువాత, రాజు కవిత్వం, మడాం కవిత్వం, జాకీ కవిత్వం, జోకర్ కవిత్వం - ఇత్యాది

వొ_స్తయ్. నీకేసులో ఆసుకవిత్వం, తగిన డోసులో పడకపోతే లాభంలేదని –

శర్మ:—ఈచలి ఇంకెల్లా పోతుందే—పిల్లా ?

మామ:—చలి వేస్తోందా ? ఆసంగతి ఇందాకనే ఏడవలేక పొయ్యావ్ ? మలేరియాకు పాత కాతాదారుడివా యేం ? వేసుకో ఒకడోస్ !

[బలంగా, శర్మనోరు పగలదీసి బ్రాందీ పోశాడు. శర్మకు ఉక్కిరి బిక్కిరై కోలమారింది. ఎలాగో కొద్దిగా మింగక తప్పిందికాదు. కొంత ఉమ్మేశాడు. మామగారి చొక్కా, పక్కా ఖరాబయినై]

మామ:—(చొక్కా దులుపుకుంటూ) కొత్త మేళాం కాబోలు నాయనా ! సోడాలేకుండా ముడిసరుకును మింగలేవూ ? ఇస్త్రీచొక్కా—అంతా ఖరాబ్ చేశావే !

శర్మ:—ఏమిటే—మోటు సరసం ?

మామ:—నేను సరైన సరసానికే దిగుతే—నీశరీరంలో ఏ విధమైన ఎగుడుదిగుళ్ళూ ఉండవురా—నాథా !

శర్మ:—అబ్బ ! చలి ! కావిలించుకోవే !

మామ:—ఇంకా వొదల్లా చలి? ఉండు. . , చలిమంట వేస్తా. ఇక్కడున్న గంపెడు పుస్తకాలూ, నీ రచనలు దస్త్రాలూ, బాగా ఉపయోగ పడతాయిలే!

[లేచివెళ్లి ఒక బొత్తి పుస్తకాలు తీశాడు]

శర్మ:—అవి నా రచనలు !

మామ:—ఒట్టి కోతలు! ప్రజలకు వాతలు! డబ్బా మోతలు

[అవి గది మధ్యలో పారేసి ఇంకో బొత్తి ఎత్తాడు]

శర్మ:—అవి నా ప్రజా నాటికలు!
మామ:—స్మశాన వాటికలు!

[ఆ బొత్తి పారేసి. ఇంకో బొత్తి ఎత్తాడు]

శర్మ:—అదంతా నా భావ కవిత్వం!
మామ:—నీ శరీరంలోని పైత్యం!

[ఆ బొత్తి పారేసి, డ్రాయర్ సొరుగు మొత్తం పైకి లాగాడు]

శర్మ:—అది నా రచన భోషాణ్ణం!
మామ:—తుక్కుడుదారం? చెత్తచెదారం!

[మొత్తం దులిపి పోగు చేశాడు]

(అగ్గిపుల్లగీస్తూ) రా నాయనా! మంటకు కాస్త దగ్గిరిగా జేరు...

(శర్మ అదిరి, పుస్తకాలన్నీ నిజంగా అగ్ని పాలౌతయ్యేమోనని, పోగు మీద విరుచుకు పడ్డాడు)

మామ:—లే....నీ ఒళ్ళు కూడా కాలి బొబ్బలెక్కుతుంది.
శర్మ:—నాకు చలిలేదు - ఊరికనే అన్నాను.
మామ:—చెంపలు వేసుకో!

(శర్మ హెల్ప్‌లెస్‌గా చూసి, ఇక గత్యంతరంలేక, చెంపలు వేసుకున్నాడు)

మామ:—(బుడ్డిలో మిగిలినపదార్థాన్ని ఖాళీచేసి) ఇప్పుడు-యీ ఫ్రెంచిద్రావకం పడ్డాక, నిజంగా స్వర్గానికి ఒక్కటేమెట్టు తక్కువలో ఉన్నాను. (తేపి) ఇంకో బుడ్డి వుందా ?

శర్మ:—లేదు.

మామ:—(తూలుతూ, శర్మ గడ్డం పట్టుకొని) ప్యారీ !

శర్మ:—(అదిరి, తనమీద పడకుండా పట్టుకుంటూ) తూల వోకండి - తూలవోకండి...నేను పట్టుకోలేను—

మామ:—పిల్లా ! చుక్కపడ్డాక తూలకుండా ఉండటంకల్ల ! తప్పేముందీ నావల్ల !

(ఖాళీసీసా అవతలికి విసిరిపారేశాడు. పెద్దచప్పుడైంది)

శర్మ:—ఆc. చప్పుడైతే నాన్నవొస్తాడు.

మామ:—ఏంవొస్తే ? ప్రజాకభీ ! ఇందాకటినుంచీ నువ్వు స్తోత్రంచేస్తూన్న ఆడవాళ్ళందర్నీ వెంటనే ఇక్కడికి దింపు ! లేకపోతే, ఇందాక శాంపిల్‌చూపిన గుద్దు ల్లాంటివి, నీ వీపును తాషామరబాగా మోగిస్తయ్ !

శర్మ:—(గేయం)

సీతో బేరం
ముక్కుకు దారం !
కంట్లో కారం !
ఒంటికి వికారం !

మామ:—ఐతే ఇది వినవే పిల్లా! సోడాబుడ్డీ!

(గేయం)

నీ గాజుల గలగల
నా వొంటికి జిలజిల!
నీ కెంపుల లోలాకులు (Love-locks)
ఎండిన నాగుండెల్లో బాకులు!
నీగజ్జల ఒడ్డాణ్ణం!
నాకో పండగ పరమాణ్ణం!
నీ మెడలో హారం
నామనో వికారం!
నీ చూపుల గాలం
హనుమంతుని వాలం! (Elastic!)
నా పైత్యానికి అల్లం!
నా శైత్యానికి బెల్లం!
నీతో విహారం
నాపాలిట క్లోరోఫారం!
మనిద్దరి వ్యవహారం
ఈ ప్రేమ గుడారం!

మామ:—ఆహా!...ఓహో!...అసలుసంగతిమరిచిపొయ్యా. ఏరిరా గుండ్రాళ్ళలాటి నీ ప్రియురాళ్ళు? దింపవట్రా? కాచుకో - గుద్దు పడుతోంది.

[ పిడికిలి బిగించి, చెయ్యి పైకెత్తాడు ]

శర్మ:—(భయపడుతూ) అలాంటివా ళ్ళెవరూలేరు...అంతా అబద్ధం!...గుద్దవోకండి –

మామ:—ఓరినీ! నాకే టోపీ తొడిగేందుకు వొచ్చావుట్రా? కాచుకో...మణుగు గుద్దు...చచ్చావ్!

[ శర్మను వొంగ తీశాడు ]

శర్మ:—అరుస్తాను –

మామ:—అరిచేందుకు ప్రాణం మళ్ళీ తిరిగిరాదని తెలియదట్రా – ప్రాణనాథా!

శర్మ:—(ఈ అపాయంలోంచి తప్పించుకునే ఉపాయాన్ని చప్పున ఆలోచించి) అల్లుణ్ని చంపుకుంటూరా?

మామ:—(శర్మనువొదిలి) సమయానికి జ్ఞాపకం చేశావ్ కనుక సరిపోయింది. ఐతే మధ్యాహ్నం యీ పెళ్ళి వొద్దని ఏమిటో వాగావుటే? నీ ఒళ్ళు ఏం కొవ్విందిరా! (ఒక్కపోటు వొడిచాడు)

శర్మ:—కాదు...పొడవబోకండి... అదంతా అబద్ధం! ఇప్పుడు చెప్తున్నాగా – మీ అమ్మాయి మీద నాకు పుట్టుకొచ్చినంత ప్రేమ –

మామ:—ఒక్క పుట్టి ప్రేమేనట్రా?

శర్మ:—ఒకటేం ఖర్మం!...ఒక్కవెయ్యి పుట్లు...కాదు... ఒక మిలియన్ పుట్లు ... పోనీ కోటి ... అర్బుదాలు! నిర్బుదాలు!

మామ:—మరి పెళ్ళెందుకు వొద్దన్నావ్ ?

[ఇంకో పోటు పొడి చేందుకు పిడికిలి సిద్ధం చేస్తున్నాడు]

శర్మ:—కొట్టొద్దు...ఐనా, మీ కింత నిషా ఏమిటీ-ఒక్కణ్ణీ పట్టుకో లేక ఛస్తున్నాను!...పెళ్ళి వొద్దని నేను అన లేదు...నాన్న అన్నాడేమో!

మామ:—ఐతే ఉండు...మీ నాన్నను కూడా బలంగా నాలుగుపోట్లు పొడిస్తేనే కాని, నిజం బైటికి దూకదు...

[ పెళ్ళెందుకు రెండడుగులు వేశాడు ]

శర్మ:—(మామను పట్టుకొని వారిస్తూ) ఈ నిషాలో ఊరం దర్నీ పొడిచేట్టున్నారు. అదంతా ఇప్పు డెందుకూ! నేను యీ పెళ్ళి తప్పకుండా చేసుకుంటాను...ముమ్మాటి కీను !

మామ:—చేసుకోకపోతే నీ చర్మం వొలవనూ! ఆహా! ఏం ఆనందం! బ్రహ్మానందం! ఉండు... యీ సంతోష సమ యంలో ఒకింత భగతనాట్యం చెయ్యనీ !

[ నడుంబిగించి, గదిలో నాట్యంచేస్తూ, ఎగిరెగిరి దూకుతూ, బల్లల్నీ, కుర్చీల్నీ, పుస్తకాల్ని విసిరికొడుతున్నాడు ]

శర్మ:—(మోకరించి) మహానుభావా! ఆపత్ బాంధవా! ఆర్తత్రాణపరాయణా! మామా! ఈ అర్ధరాత్రి ఊరు ఊరంతా లేచివొస్తుంది ... నా టాపు ఎందుకు లేపు తావూ! నువ్వు చెప్పినట్టల్లా వింటాను—

మామ:—(కాస్త ఆగి) పెళ్ళిమాటో ?

శర్మ:—చేసుకుంటాను. చేసుకుతీరుతాను. సరేనా ?

మామ:—ఆహా ! యీ సంతోషసమయంలో కాస్త హరి
కథా కాలక్షేపమూ ప్లస్ భరతనాట్యమూను.

(మళ్ళీ నడుంబిగించి హరిదాసుడిలాగు ఎగురుతూ)

పాట

గరుడగమన – రుడగమన – డగమన
– గమనా !...న్నయ్...న్నయ్...న్నయ్ !

(నాట్యంచేస్తున్నాడు)

శర్మ:—మీ నిషా, మీ వ్యవహారమూ చూస్తే, కాస్సే
పుంటే, ఆ దూకుడంతా నామీదే దూకేట్టున్నారు.
నేను పోతాను.

(వెళ్ళేందుకని శర్మ రెండడుగులు వేశాడు. మామ బలవంతాన శర్మను కుర్చీలో కూలేశాడు.)

మామ:—ఆగు ... ఇక్కడ ప్రేక్షక మహాజనంబులు
లేకుండా, నేను యీకుర్చీలకూ, మంచాలకూ, బల్లలకూ,
నీ బేవకూ్స సాహిత్యానికీ, నాట్యం చేస్తానట్రా ? లేచా
వంటే సీడొక్క చీల్చి డోలు కడతాను. బుర్ర రామ
కీర్తన పాడిస్తాను—

పుర జనుల కోరికపై ఇంకొక్క ప్రదర్శన మాత్రమే !

(మళ్ళీ నాట్యం ప్రారంభించాడు. మెట్లమీద శర్మ తండ్రి వస్తూన్న చప్పుడు.)

శర్మ: —(మోకరించి, ప్రార్థనపూర్వకంగా) స్వామీజీ! మా నాన్న వొస్తున్నాడు. ఇప్పుడే మనిద్దర్నీ, మేడమీంచి బజార్లోకి విసిరి పారేస్తాడు. నాప్రార్థన - యీదీనుడి ఆలాపన కాస్తవినండి. మీ ఇష్టం వొచ్చినట్లల్లా చేస్తాను. స్వామీజీ! మామాజీ!...(నమస్కరించాడు)

మామ:—(శర్మనెత్తిన చెయిపెడుతూ) లెమ్ము! కుమారా! కరుణింపబడితివి!

(ఊడుతూన్న పంచను, సరిగ్గా కట్టుకున్నాడు. క్షణం గడిచింది, శర్మ తండ్రి వొచ్చాడు)

తండ్రి:—ఏమిట్రా అబ్బాయీ! అర్థరాత్రి యీగోలంతా?

మామ—ఏంలేదు - శర్మకు కాస్త ఒళ్ళుతూలుతూంటే-

(శర్మ, తండ్రి వెనుకనుంచి, చెప్పవద్దని అణకువగా, ప్రార్థనా పూర్వకంగా వారిస్తూ, నమస్కరించాడు)

తండ్రి:—పైత్యం చేసిందా యేం?

మామ:—ఏమో—నాకు భరతనాట్యం చేస్తున్నాడు!

తండ్రి:—ఏరా వెధవా! ఆపెద్దమనిషి ఎదటనే నట్రా నీ భరతనాట్యం? నీభరతంపట్టతానుండు (కోపంతో చేతి కర్ర ఎత్తాడు)

మామ:—(కర్రపట్టుకొని వారిస్తూ) ఇందాకనే నేను శరీరం శాస్త్ర సద్ది, సగం పైత్యం నొగిలించాను లెండి! ఇక్కడ నేను వుండగా, పెద్దలు మీరు చెయ్యి చేసు కునేదాకా, వ్యవహారాన్ని రానిస్తానా?...చిన్నతనం

కాదూ - పెళ్ళి అనేప్పటికి, ఒళ్ళు పులకరించి, నరాలు జలదరించి. అలా చేశాడు...నా పెళ్ళప్పుడు నాకు భూమ్యాకాశాలకు భేదం తెలియ లేదు ! ... ఆ యీడులో వీడూ అంతే ననుకుంటాను - బావ గారూ !

తండ్రి:—పెళ్ళి ఇష్టం లేదని ఏడ్చాడుగా ?

మామ:—ఇప్పుడు అడగండి.

తండ్రి:—(శర్మవైపు తిరిగి) ఏరా ?

[మామ, తండ్రి వెనుక నుంచి, పిడికిల ిగించి, బెదిరిస్తూ, ఒక కాలు ఎత్తాడు]

శర్మ:—(భయంతో కూడిన సిగ్గుతో) నాకుఇష్టమే నాన్నా!

మామ:—మొదట వొద్దనటం అదంతా బెట్టు! గంట క్రితం ఇక్కడికి వొచ్చి, నేను నిద్ర పోతూంటే, నా రెండు కాళ్ళూ గట్టిగా పట్టు కున్నాడు. తేలో, పామో, జెర్రో నని నేను హడిలి పోయి, లేచి చూద్దును — శర్మ! "ఏమిటి ? ఏమిటి ?" అంటే - "మామ గారూ! ఈ సంబంధం కుదరకపోతే, నాకు పొటాసి యం సైనైడే శరణ్యం!" అన్నాడు. "సరేనాయనా! నువ్వింత బుద్ధిమంతుడి వనుకోలేదు. ఈ పెళ్ళి ముహూర్తా టికే ఖాయమే! పోయి పడుకో!" అని ఎంతో సర్ది చెప్పాను. ఇంకేం - ఆ సంతోషంతో రంకులు వేటం లాగు, గదంతా తిరుగుతూ ఒకటే భరతనాట్యం చెయ్య

శర్మ:—(మోకరించి, ప్రార్థనపూర్వకంగా) స్వామీజీ! మా నాన్న వొస్తున్నాడు. ఇప్పుడే మనిద్దర్నీ, మేడమీంచి బజార్లోకి విసిరి పారేస్తాడు. నాప్రార్థన – యీాదీనుడి ఆలాపన కాస్తవినండి. మీా ఇష్టం వొచ్చినట్లల్లా చేస్తాను. స్వామీజీ! మామాజీ!...(నమస్కరించాడు)

మామ:—(శర్మనెత్తిన చెయిపెడుతూ) లెమ్ము! కుమారా! కరుణింపబడితివి!

(ఊడుతూన్న పంచను, సరిగ్గా కట్టుకున్నాడు. క్షణం గడిచింది. శర్మ తండ్రి వొచ్చాడు)

తండ్రి:—ఏమిట్రా అబ్బాయీ! అర్థరాత్రి యీాగోలంతా?

మామ—ఏంలేదు – శర్మకు కాస్త ఒళ్ళుతూలుతూంటే–

(శర్మ, తండ్రి వెనుకనుంచి, చెప్పవద్దని అణకువగా, ప్రార్థనా పూర్వకంగా వారిస్తూ, నమస్కరించాడు)

తండ్రి:—పైత్యం చేసిందా యేం?

మామ:—ఏమో–నాకు భరతనాట్యం చేస్తున్నాడు!

తండ్రి:—ఏరా వెధవా! ఆపెద్దమనిషి ఎదటనే నట్రా నీ భరతనాట్యం? నీభరతంపడతానుండు (కోపంతో చేతి కర్ర ఎత్తాడు)

మామ:—(కర్రపట్టుకొని వారిస్తూ) ఇందాకనే నేను శరీరం కాస్త సర్ది, సగం పైత్యం నొదిలించానులెండి! ఇక్కడ నేను వుండగా, పెద్దలు మీారు చెయ్యి చేసు కునేదాకా, వ్యవహారాన్ని రానిస్తానా?...చిన్నతనం

కాదూ - పెళ్ళి అనేప్పటికి, ఒళ్ళు పులకరించి, నరాలు జలదరించి. అలా చేశాడు... నా పెళ్ళప్పుడు నాకు భూమ్యాకాశాలకు భేదం తెలియ లేదు ! ... ఆ యీడులో మీారూ అంతే ననుకుంటాను - బావ గారూ !

తండ్రి:—పెళ్ళి ఇష్టం లేదని ఏడ్చాడుగా ?

మామ:—ఇప్పుడు అడగండి.

తండ్రి:—(శర్మవైపు తిరిగి) ఏరా ?

[మామ, తండ్రి వెనుక నుంచి, పిడికిల ిగించి, బెదిరిస్తూ, ఒక కాలు ఎత్తాడు]

శర్మ:—(భయంతో కూడిన సిగ్గుతో) నాకు ఇష్టమే నాన్నా!

మామ:—మొదట వొద్దనటం అదంతా బెట్టు! గంట క్రితం ఇక్కడికి వొచ్చి, నేను నిద్ర పోతూంటే, నా రెండు కాళ్ళూ గట్టిగా పట్టు కున్నాడు. తేలో, పామో, జెర్రో నని నేను హడిలి పోయి, లేచి చూద్దును — శర్మ! "ఏమిటి ? ఏమిటి ?" అంటే - "మామ గారూ! ఈ సంబంధం కుదరకపోతే, నాకు పొటాసి యం సైనైడే శరణ్యం!" అన్నాడు. "సరేనాయనా! నువ్వింత బుద్ధిమంతుడి వనుకో లేదు. ఈ పెళ్ళి ముమ్మా టికీ ఖాయమే! పోయి పడుకో!" అని ఎంతో సర్ది చెప్పాను. ఇంకేం - ఆ సంతోషంతో రంకులురాటం లాగు. గదంతా తిరుగుతూ ఒకటే భరతనాట్యం చెయ్య

సాగాడు. ఒంటరిగాణ్ని పట్టుకోలేక, ఎంతో బతిమాలుతూ చెప్పినా, వినలేదు. ఈపెళ్ళి ఇంకా ఏమాత్రం ఆపినా, యీభరతనాట్య ప్రదర్శనం రోడ్డుమీదిదాకా పోతుంది...అప్పుడు వైజాగ్ పంపే అవసరం ఏర్పడుతుంది !

తండ్రి:—వీడికి పెళ్ళంటే ఇంత పులకరింపు అనుకోలేదు. ఇంకా ఆలస్యం కూడా దేనికీ ? శుభస్య-శీఘ్రం !

మామ:—ఇంకా ఆగుతావేం శర్మా ! త్వరగాపోయి పెళ్ళి కొడుకువిగా !

తండ్రి:—ఊం. పోయి త్వరగా తయారవరా - తెల్లారుతోంది !

[శర్మ వెళ్తున్నాడు. మామగారు శర్మను వెనక్కి పిలిచాడు. శర్మ వొచ్చాడు]

మామ:—మాట...ఇందాక, నాకుతలనొప్పివొస్తేఇచ్చావే —ద్రావకం !...అది ఇంకొక్క నాలుగు ఔన్సులన్నా ఉంటే పంపు - ఒక్కడోసుకే ఒళ్ళంతా తేలికైంది... ఏం మందండీ ! వహ్వా !

తండ్రి:—వెంటనే వారికామందు పంపు...

శర్మ:—అది ఫ్రెంచిద్రావకం......ఈ యుద్ధసమయంలో దొరకదు.

తండ్రి:—ఎలాగో సాధించు...నీస్నేహితుల పలుకుబడితో బ్లాక్‌మార్కెట్‌లోనైనా సంపాయించు ... ఇంధాకట్టి

నుంచీ పాడుగోలంతా చేసి, వారిమనస్సు చెడగొట్టావ్ !
పెద్దమనిషి కనుక, సహించి ఊరుకున్నాడు.

శర్మ:—సరేలే !

[శర్మ వెళ్ళిపొయ్యాడు]

మామ:—పెళ్ళయ్యేదాకానే లెండి - యీ నాట్యాలు

తండ్రి:—అంతే!...అంతే !...చిన్నవెధవ - ఏదన్నా తప్పుచేసివుంటే - క్షమించండి.

మామ:—ఎంతమాట ! మరేంఫర్వాలేదులెండి.

[ శర్మ మళ్ళీ వొచ్చాడు ]

తండ్రి:—ఏరా శర్మా! మళ్ళీ వొచ్చావేం?

శర్మ:—ఇవన్నీ కాస్త సర్దుకొని ఇప్పుడే వొచ్చేస్తాను.

తండ్రి—సరే...ఆలస్యం చెయ్యవోక త్వరగారా...బావ గారూ! మనం వెళ్దాంపదండి -

[ తండ్రీ, మామా వెళ్ళిపొయ్యారు. శర్మ చెల్లాచెదరైన పుస్తకాల్ని సర్దుకుంటున్నాడు. క్షణం గడిచింది. దాసూ, మూర్తీ వొచ్చారు ]

దాసు:—ఏరా బ్రదర్! మామగాడు ఏమైనట్టూ?

మూర్తి:—స్టేషన్‌లో మెయిల్‌కు కాపలా కాయలేక మా దుంప తెగింది!

శర్మ:—(చప్పరించి) ఏం మామో !

దాసు:—మొహం అలావుందేం - దివాళాతీసిన సాహుకారులాగు ?

మూర్తి:—పూటా రూపాయిలాగు!

శర్మ:—ఇంకెలా వుంటుంది? నూరూ అంటే మామూ? పులి! పులి...! చుంకన్న వాలుగాకులు ఎక్కువే చదివాడు!

దాసు:—ఏం చేశావేం?

మూర్తి:—వీపు తామరాకులా ఐందాయేం?

శర్మ:—ఒక్క వీపేం ఖర్మం? శరీరమంతా అల్లమరబ్బా చేసేశాడు!

దాసు:—అప్పుడు సహాయం కోసం కేకలు వెయ్యలేక పొయ్యావా?

శర్మ:—ఎట్లా? మనదు కాణా కాస్తా బైటపడి పోతుందావు!

దాసు:—ఈ సంగతి ముందుగా తెస్తే ఒక కవచమన్నా తయారు చేసి ఇచ్చేవాళ్ళం.

మూర్తి:—నీ బంక కవిత్వమన్నా పనిచెయ్యలా ?

శర్మ:—వాడి సర్వీస్ కవిత్వంముందు బంక కవిత్వం ఠోలీకి పనికిరాదు!

దాసు:—ఇంతకూ ఏం జరిగిందో చెప్పు -

శర్మ:—ఏం జరగబోతోందో వింటే - ఏం జరిగిందో వినక్కర్లేదు -

మూర్తి:—పోనీ అదన్నా చెప్పు -

శర్మ:—నా వివాహం స్థిరపడిపోయింది. వాడ్ని ఎదుట అంగీకారాన్ని ఇచ్చెయ్యాల్సి వొచ్చింది.

దాసు:—(నిట్టూర్పు) ఆం...మూర్తిగాడికి ఇక యీజన్మలో పెళ్ళయ్యే యోగ్యంలేదు !

మూ_ర్తి:—నీకు అవుతుంది కనుకనా - నేను దిగులు పడేందుకు !

దాసు:—ఇంతకూ బ్రాండీబుడ్డి ఏదిరా ?

శర్మ:—వుంది లే !

దాసు:—ఇటివ్వు -

శర్మ:—ఇదిగో - అక్కడ...ఖాళీబుడ్డి -

దాసు:—ఖాళీదా ? మరి ద్రావకం ?

శర్మ:—మామగాడి పొట్టలో భద్రంగావుంది.

మూ_ర్తి:—మన శర్మకు పెళ్ళవుతూంటే వెధవబ్రాందీ బుడ్డి పోతే మాత్రమేం ?

దాసు:—బుడ్డి నాది కనుక 'పోతేమాత్రమేం ?' అన్నావ్.

శర్మ:—అది సరేకాని - నీ దగ్గర ఇంకో బుడ్డివుందా ?

దాసు:—ఎందుకూ ?

శర్మ:—మామకు డోసు చాలలేదట - ఇంకోటికావాలట !

మూ_ర్తి:—వీడేం మామగా లేడే ! గామాంగా ఉన్నాడు ! వాములు మేసే స్వాములవారికి పచ్చగడ్డి ఫలహారం లాగు ఇరవైనాలుగు ఔన్సుల బుడ్డికూడా చాలలా ? వీడి వ్యవహారం మనకన్న చాలా ఎడ్వాన్స్‌డ్ గా వుం దే!

దాసు:—బుడ్డిని గూర్చి ఎంత జాగర్తగా ఉండమని చెప్పారా !

శర్మ:—నన్నేం చెయ్యమంటావ్ - బుడ్డి ఎత్తి గడగడా తాగుతూంటే నాకే ఆశ్చర్యమైంది - అదీకాక-

(గేయం) నువ్వు నాతో చెప్పిన (Caution)
మామయ్యకు వొక (Ration)

మూర్తి:—ఎట్లా ? ఎట్లా ?
శర్మ:—(గేయం) అది మీ ఇద్దరికీ అంతందని (Pacific Ocean)
దాసు:—మరి నీకో ?
శర్మ:—(గేయం) నాకో (Clean, healthy-motion)
మూర్తి:—కవివిరా !

(మామ వొస్తూన్న చప్పుడు)

శర్మ:—(రహస్యంగా) ఒరేయ్ ! దూరంగా ఉండండి... మీదపడ్డాడంటే - మళ్ళీ కాళ్ళమీద లేచి నిలబడటం కష్టం !
దాసు:—చూస్తే నే మూర్ఛవొస్తోంది.
మూర్తి:—శివరాత్రి ప్రభలాగు-

[మామ వొచ్చాడు]

మామ:—కభీ ! ఎవర్రా యీ సైన్యం ? ఏమిట్రా ఆ రహస్యాలు ! ఏదిరా ద్రావకం ? తలనెప్పి మరీ జాస్తయింది ...అరడజను కళ్ళతో అలా దేబిరిస్తూ చూడకపోతే, కాస్త ప్రజాసేవచేసి తరించరాదట్రా ?

శర్మ:—(దాసును చూపుతూ) వీడేసార్ - మీ మందు సప్లయ్ చేసేది.

దాసు:—నువ్వట్రా ? వేలెడు లేవు...ఆగు చెప్తాను

(మామ పంచ ఎగకడుతున్నాడు)

శర్మ—ఒరేయ్...మైలు రేసు పెట్టండి - లేకపోతే చస్తారు!

మామ:—హుూత్ !

(దాసూ మూర్తీ పరుగెత్తారు)

(మీసం మెలేసి) దెయ్యాల మంత్రగాణ్ణిరోయ్ ! మనుషులు వొక లెక్కా ? ఐనా ఇంత పిరికి వెధవలేరా నీ స్నేహితులు ?

శర్మ:—తమబోటి పెద్దల సహవాసం లేక-

మామ—అలా దారికిరా...ఆలస్యమౌతోందని మీ మునలాడు గోలపెడుతున్నాడు - రా...

(మామా శర్మా వెళ్ళిపొయ్యారు)

—తెర—

# ఎర్ర బుట్టలు

[ఆ గ్రామంలోకల్లా ధనవంతుడైన రాఘవయ్య ఇంటిలోని ముందరి సావిడి, గచ్చుచేసిన నేల శుభ్రంగావుంది. గోడలు తెల్లగా ఉన్నవి. గోడలమీద, ఇక్ష్వాకులనాటి రంగురంగుల చిత్రాలూ వేళ్ళాడుతూండ టాన్నిబట్టి, యీ ఇంటి వాతావరణంలో నవనాగరికత తన కల్లోలాన్ని ఇంకా ప్రారంభించలేదని గ్రహించవొచ్చు.

గోడగడియారం లెక్కపెట్టుకుంటూ ఇప్పుడే ఆరుగంటలు కొట్టింది. కిటికీల్లోంచిపడే గుడ్డివెలుగుచూసి, యిది సాయంత్రమై వుం టుందో, ఉదయమై ఉంటుందో చెప్పటం కష్టం.

సావిడికి మధ్యగా వొక వుయ్యాలబల్లా, పక్కన వొక పెద్ద నవారు మంచమూ వున్నవి. మూలగా వొక్లగాదా వొకపెద్ద భోషాణమూవున్నయ్.

సింహద్వారం మాత్రం మూసేవుంది.

క్షణం గడిచింది. అవతల యెవరో తలుపు బాదారు. జవాబు రాకపోవటంవల్ల, మళ్ళీ తలుపు గుద్దుతూ 'ఎవరండీ—యింట్లో?' అని కేకలేశారు. కంఠమృదుత్వాన్ని బట్టి పురుషుడే అయివుండవొచ్చు.

ఇంటి యజమానురాలు నరసమ్మ తడిచేతుల్తో చప్పున వొచ్చింది. వయస్సునలభై వుంటుంది. కాని యే ఇతర కారణాలవల్లనో ఆమెముఖంలో మామూలుకన్న ఎక్కువ ముసలితనం కనిపిస్తుంది. ముఖాన రూపాయి వెడల్పు కుంకుమబొట్టు ప్రముఖస్థానాన్ని అలంకరించుకుంది. ఒంటిమీద ప్రస్తుతం ఆభరణా లేమీలేవు.]

నరసమ్మ:— ఎవరూ ?

కంఠధ్వని:—(అధికారంగా) తలుపు తియ్యండి!

నర:—ఎవరంటే?

కంఠధ్వని:—(తలుపు బాదుతూ) తలుపు తియ్యండి నేను పోలీసు ఇనస్పెక్టర్ను!

[ తలుపు తియ్యగానే నరసమ్మ ఆ మాటతో గెంటడుగులు వెనక్కి వేసింది. ఏదో భయంతో ఆమె ఒక్కక్షణం నిలబడిపోయింది. వెంటనే తేరుకొని, తను మాట్లాడేవ్యక్తి తనకు ఎదురుగా లేక పోవటం వల్లా, తా మిద్దరికీమధ్య గట్టిగోడ ఒకటి వుండటంవల్లా, ఆమె తన పిరికి తనానికి సిగ్గు పడ్డది. బైటివ్యక్తి, తాను యీ ఆలస్యాన్ని భరించనట్లు సూచించేందుకు. మరింతగట్టిగా తలుపు బాదుతూ—]

కంఠధ్వని:—తలుపు తియ్యరేమండీ ?

నర:—ఎందుకండీ? ఎవరికోసం ?

కంఠధ్వని:—రాఘవయ్యగారి కోసం; వెంటనే తలుపు తెరవండి.

నర:—వారు దొడ్లో మొహం కడుక్కుంటున్నారు; పిలుచు కొస్తాను; ఆగండి—

[ ఆమె వెళ్ళిపోయింది; కాని ఆ సంగతి అవతలివ్యక్తికి తెలియక పోవటంవల్ల—]

కంఠధ్వని:—ముందుతలుపు తియ్యండి, యిలా ఆలస్యం చేస్తే !

[ గొంతుచించుకొన్నా జవాబు రాకపోవటంవల్లా, అవతల యేం జరుగుతోందో తెలియక పోవటంవల్లా, ఇక మౌనమే ఆశ్రయించదగ్గదిగా తోచి పూరుకున్నాడు.

క్షణం గడిచింది.

నరసమ్మ భర్త రాఘయ్యతో ప్రవేశించింది. రాఘవయ్య వయస్సు దాదాపు యాభై దాకావున్నా కష్టించే మనిషికావటంవల్ల, బాగాబలంగా కండలుతేరిన శరీరాన్ని పెంచాడు, అందుకని తెలియనివాళ్ళు. నరసమ్మ కన్నా చిన్నవాడని పొరపాటు పడతారు. నల్లగా, పొట్టిగా వున్నా

ముఖంలో కళవుంది. టూత్ బ్రష్షులాటి మీసాల్నిచూసి పిల్లలు భయపడతారుకూడాను. ఎర్రటి పంచ కట్టుకొని, రంథ్రోల్లాంటి పొట్టను కప్పి వుచ్చలేని వొక తువ్వాలుమాత్రం భుజంమీద వేళ్ళాడేశాడు. ఇది యితని నైట్ డ్రెస్ అయివుండవొచ్చు ]

నర:—బైట వున్నట్టున్నాడు; తలుపుతియ్యండి.

రాఘు:—నువ్వే తియ్యవే.

నర:—అయ్యో! అట్టా భయపడతారేం? మొగాళ్ళకే ఇంత భయమైతే ఎట్లా ?

[బైటివ్యక్తికి యీ అలికిడి వినపడి, లోపల సజీవులైన వ్యక్తులు వున్నట్టు గ్రహించి, తలుపు బాదుతూ—]

కంఠధ్వని:—ఏమండీ ! తలుపు తెరిచేందుకే యింతసేపా ?

[ఇక మర్యాద దక్కదని, రాఘవయ్య ధైర్యంచేసి, తలుపు తెరిచాడు. పోలీసు ఇనస్పెక్టరు ప్రవేశించాడు. కాకీనిక్కరూ, కాకీచొక్కా; భుజాలమీద M. P. అనే తెల్ల అక్షరాలూ, చంకన దొరటోపీ, చేతిలో వెండిపొన్ను వేసిన బెత్తమూ వున్నయ్. కాళ్ళకు మంచి రకం బూట్ వున్నసంగతి ఎదుటివారు గ్రహిస్తారో లేదోనని, అనవసరమైనా చప్పుడు చేసుకుంటూ వొచ్చాడు. వయస్సు ముప్పై దాదాపు ఉండొచ్చు.]

రాఘు:—దయచెయ్యండి...దయచెయ్యండి...

[సబ్ ఇనస్పెక్టరు, ఠీవిగా ఉయ్యాలబల్లమీద కూర్చొని, ముఖం రొత్తి, ముడిచిన కనుబొమల్ని మెల్లిగా విప్పుతూ—]

సబ్:—తలుపు తియ్యటమే మీకు కష్టంగా వున్నట్టుందే?

రాఘు:—ఏదో ఆడవాళ్ళు. పోలీసులంటే సహజంగా భయపడి నన్ను కేకేసింది. కొంచెం ఆలస్యమైనందుకు క్షమించాలి...

[నరసమ్మ, యేం జరుగుతుందోనని ఆతృతతోనూ, భయంతోనూ, గుమ్మాన్ని ఆనుకొని నిలబడ్డది. ఇనస్పెక్టరు జేబులోని కాగితాన్ని విప్పి, ఒకసారిచూసి మళ్ళీ మడుస్తూ—]

సబ్:—అరెస్టువారెంటు వుంది—

రాఘు:—(చేతులు నలుపుకొంటూ) నాకే? యీమధ్య ఫ్యాక్టరీ కింద ధాన్యం బ్లాక్ మార్కెట్టులో కొనలేదే!

నర:—అయ్యో ఖర్మమా!

సబ్:—మీకుకాదు భయపడవొకండి.

రాఘు:—(సగం తేరుకొని) నాకు కానప్పుడు, తమరు మా యింటికే వచ్చినందుకు...

సబ్:—కారణంవుంది. ఈకప్పుకింది వ్యక్తుల్లోనే వొకరికి అరెస్టువారెంటు వుంది.

[రాఘువయ్యా, నరసమ్మా వొకరిముఖం వొకరు చూసుకున్నారు]

నర:—నాకు కామకదా?

సబ్:—కాదులెండి. పదిరోజుల్నుంచీ మీ యింట్లో అతిథిగావున్న దొంగసాములారున్నాడే!—

రాఘు:—అయన్ను దొంగస్వాములారనవొకండి కళ్ళుపోతాయి! వారు గొప్ప మంత్రశక్తి గలవారు. ఆ

శ్రీకృష్ణ పరమాత్ముడి అవతారమే అనేందుకు సందేహం లేదు...

సబ్:—ఔను. కృష్ణుడు వెన్నదొంగ; వీడు డబ్బుదొంగ; అంతే భేదం!

నర:—వారి మహత్తు మీకు తెలియదు. మాకు అనేక ప్రత్యక్ష నిదర్శనాలు చూపారు. ఎంత బలవంతం చేసినా దమ్మిడీకూడా పుచ్చుకోనన్నారు—

సబ్:—వాడు దమ్మిడీలదొంగ కాదు; రాగినాణాలు వాడికి అక్కరే లేదు. సువర్ణంతప్ప యింకేమీ తాకడు!

రాఘు:—వార్ని వొక్కసారి దర్శనంచేస్తే మీ రల్లా అనరు. వారి ముఖంలో బ్రహ్మతేజస్సువుందే—

సబ్:—ఏనేమీ చెప్పకుండా ముప్పూటా పిండివంటల్తో సహా పెట్టేవాడుంటే నున్నపడచూవచ్చు, ముఖంలోకి అప్పుడు తేజస్సు దానంతటదే వొస్తుంది...

నర:—గిట్టనివాళ్ళెవరో ఆయనమీద అపవాదులు వేసి వుంటారు. అసలు ఆయన్ను ఇలా దూషించిన వాళ్ళ నోట్లో—

[సబ్ ఇనస్పెక్టరు వురిమిచూసేప్పటికి నరసమ్మ మిగతామాటల్ని దిగమింగింది. రాఘువయ్య చప్పున ఉపాయం ఆలోచించి—]

రాఘు:—ఔను అట్లా అన్నవాళ్ళనోట్లో పంచదార పడుతుంది!

నర:—(తేరుకొని) పటిక, బెల్లం పడుతుంది. మాంచి రకం పుట్టతేనెకూడా పడుతుంది.

సబ్:—ముందు ఆపాంగ వెధవ యెక్కడున్నాడో చెప్పండి; తన్నుకుంటూ తీసుకొచ్చి వాడెంత పెద్దమనిషో ఇప్పుడే మీకు నిరూపిస్తాను.

[రాఘవయ్యా, నరసమ్మా అనుమానిస్తూ చూరు కున్నారు.]

సబ్:—మీరిలా ఆలస్యంచేస్తే న్యాయాన్నీ, చట్టాన్నీ, ప్రభుత్వాన్నీ ధిక్కరించినవాళ్ళవుతారు!

రాఘు:—ఎంతమాటా...రండి...

సబ్:—ఆయన పూజగదిలో సమాధిలో వున్నారు. పోనీ కాస్త ఆగి...

సబ్:—జైలులో తీరుబడిగా సమాధిలో నిమగ్న మవు తాడు లెండి—

[రాఘవయ్యా, సబ్ఇనస్పెక్టరూ కలిసి వెళ్ళిపోయ్యారు. నరసమ్మ వొక్క క్షణం అలాగే నిలబడి పోయింది. ఇక తన వొంటరితనాన్ని భరించలేక, యేం జరుగుతుందోననే కుతూహలంతో ఆమెకూడా వెళ్ళి పోయింది.

ఒక నిమిషం గడిచింది.

సబ్ ఇనస్పెక్టరు వొక సన్యాసిని రెక్కపట్టుకొని లాక్కొచ్చాడు. సన్యాసివయస్సు ముప్ఫైఆరు వుండవచ్చు. బలిష్ఠంగా, నున్నగా వున్నాడు. బోడిగుండూ, కాషాయ వస్త్రాలు; చేతిలో కాషాయవస్త్రాలతో కట్టబడ్డ మూటవుంది. బాగా పెరిగిన గడ్డం, మనిషి నిజస్వరూపాన్ని కొంతవరకూ దాచేస్తోంది.

రాఘవయ్యా, నరసమ్మా వారివెనకాలే వొచ్చారు. నరసమ్మ ఇం డాకటిలాగే గుమ్మాన్ని ఆనుకొని నిలబడి వుంది. రాఘవయ్య ఇన స్పెక్టరు పక్కగా నిలబడ్డాడు.]

సన్యా:—నేను సమాధిలో వుండగా మీ రిల్లా చెయ్యటం-

సబ్:—గవర్నమెంటువారు లోగడ ఎప్పుడో మీకొక శాశ్వత సమాధిని నిర్మించివుండాల్సింది. కాస్తలో దూసుకుపొయ్యావ్ !

సన్యా:—నాకేమీ అర్థమవటం లేదు.

సబ్:—ఎందుకవుతుంది ? కాషాయవస్త్రాల మాటతో వుడాయించాలని చూసే దొంగ వెధవకు—

సన్యా:—అవ్వి అమ్మవారి మందిరంలోవి. అమ్మవారిపూజ పూర్తికాందే, ఆమె అనుజ్ఞ అవందే - మానవమాత్రు లెవరూ దాన్ని ముట్టరాదు...

సబ్:—నువ్వొకడివితప్ప, దేవాంశసంభూతుడివికనుక, వూరి పొలిమేర్లు దాటించి, ఆతరువాత అమ్మవారి అనుజ్ఞ తీసుకుంటాన్. అసలు అమ్మవారే నీ అనుజ్ఞ తీసుకోవా లనుకుంటాను !

(సన్యాసి చేతిలోని మూటతీసి విప్పాడు. అందులో రకరకాల సువర్ణాభరణాలూ వున్నాయ్. రాఘవయ్యా నరసమ్మా ఆశ్చర్యపొయ్యారు.)

సబ్:—చూశారా - యీ వెధవచేసిన పని ?

రాఘు:—నయమే, అమ్మవారికి సువర్ణపూజ జరగాలని యింట్లోవున్న బంగారమంతా పూజామందిరంలోకి జేర్చి-యిదా వీడు చేసిన పని ?

సబ్ :—వీ డసలు మూడుసంవత్సరాల క్రితం ఆకుపూడి దొమ్మీ కేసులోని ముద్దాయి. ఎట్లాగో తప్పించుకు పోయ్యాడు. వీడిమీద కూనీ నేరంకూడావుంది.

రాఘు:—చాలా ఘటికుడే నే ? పోలీసువారినే మూడేళ్ళ నుంచీ, మూడు చెరువుల నీళ్ళు తాగిస్తూ, ముప్పు తిప్పలూ పెడుతున్నాడంటే - ఇక మాలాంటివాళ్ళొక లెక్కా ?

సన్యా:—కూనీ నేరమా ? నేనా ? మీరు పొరబడు తున్నారు...

(సబ్ ఇనస్పెక్టరు సన్యాసి గడ్డం పట్టుకొని లాగేటప్పటికి అది పూడి వొచ్చింది.)

సబ్ :—చూశారా ! దొంగగడ్డం ! ముఖవికారం ఎదుటి వ్యక్తికి కనిపించకుండా యీ పన్నాగం.

సన్యా:—నాకున్న ఆస్థి యీ గడ్డమేనని చాటేందుకు, ఏ దొంగ వెధవా నా వెంటపడకుండా వుండేందుకు-

సబ్ :—నువ్వే గజదొంగవు. నీ వెంట యేదొంగ పడ తాడూ ? ఒక వేళ పడ్డా, వాడి జేబులో యేమన్నా వుంటే పొడలాల్సిందే కాని, నీ దగ్గర్నుంచి వాడికి మాయగష్టంతప్ప యింకేమీ పోదు !

నర:—మీరు సమయానికి వొచ్చారుకనుక సరిపోయింది కాని—

సబ్ :—అసలు యీసంగతి నాకు నిన్న నే తెలిసింది.

రాఘు:—పోనీ, నిన్ననే రాలేకపొయ్యారా ?

సబ్ :—నిన్న యెట్లారానూ ? నిన్నటివరకూ వీడు పాతనేరస్థుడేకదా ? వీణ్ని కొత్త నేరస్థుడుగాకూడా రుజూచెయ్యాలంటే, నేరం జరిగేదాకా వేచివుండాల్సిందే !

రాఘు—అసలు నేరమే జరక్కుండా చూస్తే ?

సబ్ :—అప్పుడు మా ప్రతిభ యేముందీ ? నేరం జరగాలి; లేక జరిగేట్టు చూడాలి, అప్పుడు పట్టుకోవాలి. నేరమే జరక్కపోతే అప్పుడు యీ డిపార్టుమెంటే అనవసరం !

రాఘు:—ఇప్పుడు యిక్కడ నేరం జరిగేట్టయితే, మాకు ఎంత నష్టం వచ్చేదో చూశారా ?

సబ్ :—దానికి మా బాధ్యత యేముంది ?...సరే...వీణ్ని నేను పోలీసుస్టేషనుకు తీసుకుపోతాను. మీరు స్టేట్మెంటు యిచ్చి మధ్యాహ్నానికల్లా కోర్టుకురండి.

రాఘు:—ఇదంతా కోర్టుదాకా దేనికీ ? వీణ్ని రెండుతన్ని పంపేద్దాం.

సబ్ :—ఆ పని మేం చేస్తాంలెండి. మిగతా ప్రజల సౌఖ్యం కోసం యిలాంటి దొంగవెధవల్ని ప్రభుత్వం కొన్నాళ్ళపాటు జైల్లో వుంచుతుంది. అప్పుడు వీళ్ళు కోరలు తీసిన పాముల్లాగు, నగంచచ్చి బైటపడి, బుద్ధికలిగి ప్రవర్తించటం మొదలుపెడతారు. సాయంత్రానికల్లా యీ కేసు తేలిపోతుంది. మేస్ట్రీటుముందు

యీా నగల్నిచూాపి, తరువాత మీాచి మీాకు అప్ప గిస్తాను. అందుకు రసీదు యిస్తాను.

[ జవాబుకు ఎదురు చూడకుండా నే సబ్ ఇనస్పెక్టర్ రసీదు రాస్తు న్నాడు. ]

రాఘు:—ఇవ్వి చూాపకపో తే నేం ?

సబ్:—వీడు ఎత్తుకు పొయ్యేందుకు ప్రయత్నించినవి యీా నగలేనని నిరూపించేందుకు! యీా స్టేట్మెంటుమీాద దస్కత్ చెయ్యండి.

[ సబ్ ఇనస్పెక్టరు కాగితం అందించాడు. రాఘవయ్య దస్కత్ చేశాడు.

సబ్:—సరే, నేను వొస్తాను. పదకొండింటికల్లా కోర్టుకు వొచ్చెయ్యండి...రారా బ్లడీబెగ్గర్ !

[ సన్యాసిని తీసుకొని, సబ్ఇనస్పెక్టరు వెళ్ళిపొయ్యాడు. రాఘ వయ్య. నరసమ్మ, ఒక్క క్షణం ఆశ్చర్యంతో మూగవొయ్యారు ]

నర:—సన్యాసిగాడు కా స్తయితే మనకు టోపీవేసేవాడు.

రాఘు:—ఆ టోపీదాసులక్కూడా టోపీ వెయ్యగలిగే వాళ్ళు వున్నారు – చూాశావా ?

నర:—వాడి గడ్డమూా, వాడివాలకమూా చూడగానే, మొకట దొంగవెధవని అనుమానం కలిగింది. కాని మీారు గొప్పవాడని చెప్పటం మొదలెట్టాక, నాకు కా స్త నమ్మకం కుదిరింది.

రాఘు:—ఇంకా నయం! మొదట నువ్వేవాణ్ని యోగి అనీ, సిద్ధుడనీ వ్యవహరించి, అనేకమంది పిల్లలు లేనివాళ్ళకు పిల్లల్ని యిచ్చాడనీ, మనకు తప్పకుండా మేలుచేస్తాడనీ చెప్పీ చెప్పీ నా దుంప తెంచావు. కొంచెమైతే యిల్లంతా దోచుకునేవాడు. సరే నువ్వుపోయి వంటపని చూడు; నేను త్వరగా బయలుదేరి మేస్ట్రీటు కోర్టుకు పోవాలి.

[ నరసమ్మ తలుపు గడియవేసి వెళ్ళిపోయింది. రాఘవయ్య భోషాణందగ్గర యేదో సర్దుతున్నాడు. తలుపు కొట్టిన ధ్వని. ]

రాఘు:—ఎవరూ ?

కంఠధ్వని:—తలుపు తియ్యండి.

[ రాఘవయ్య తలుపు తెరిచాడు. ఒక నల్లటి లావాటాయన వొచ్చాడు. వయస్సు నలభైదాకా వుండొచ్చు. నల్లగా భయంకరంగా వున్నాడు. మాసిన పంచా, వీపుమీద చిరిగిన చొక్కా ధరించాడు. ]

రాఘు:—ఎవరూ ?

వ్యక్తి:—నేను సర్కిల్ ఇనస్పెక్టర్ని లెండి!

రాఘు:—(హేళనగా నవ్వి) మీరా? సర్కిల్‌లాగేవున్నావు గుండుసున్నాలాగు మొహమూ, నువ్వూను. అంతకన్న 'నేనొక సన్యాసిని; దేవీపూజ చేయిస్తాను' అన్నట్టయితే, నమ్మే అవకాశం వుండేది!

సర్కి:—మీ యిష్టం వచ్చినట్టు మాట్లాడవోకండి.

రాఘు:—చాలుచాల్లేవయ్యా! చివరకు కాకీనిక్కరన్నా లేదు ...సర్కిలట...సర్కిలు! ఇంతకు ముందే మీ తమ్ముఁడొకడు, సబ్‌నంటూ వొచ్చాడు, వాడిదగ్గరకుపోయి వాడి యూనిఫారాన్ని వేసుకొనిరా.

సర్కి—ఆ యూనిఫారం నాదే! పక్క వూళ్ళో క్యాంపులో వుండగా, రాత్రి నా యూనిఫారాన్ని దొంగిలించి, ఆ దొంగ వెధవ సబ్‌ఇనస్పెక్టర్నని వొచ్చాడు. నేనంతా విచారించుకొంటూ వొచ్చాను.

రాఘు:—సర్కిలూ! నీకే టోపీవేశాడన్నమాట? టోపీ పడ్డదిగాక, చెప్పుకోవచ్చావా? ఇలాంటికథలు చాలా విన్నాంకాని యిక నడు.

సర్కి:—వాళ్ళిప్పుడు ఎక్కడ వున్నారు?

రాఘు:—వాళ్ళు యెక్కడవున్నారో వెతకాల్సిన వుద్యోగం తమదీ. అందుకే మీకు గవర్నమెంటు జీతం యిస్తోంది.

సర్కి:—మీరు స్టేటుమెంటు యివ్వండి.

రాఘు:—(విసుగ్గా) పోవయ్యా! ప్రొద్దున్నే గోల! పిచ్చియేమన్నా ఎక్కిందా? మావూళ్ళో కుర్రమూక మహాగడుసువాళ్ళు జాగర్త. చేతికోరాయి తీసుకుంటే మళ్ళీ పోదిలోకూడా రావు. పల్లెటూరు కదానని సర్కిల్ ఇనిస్పెక్టర్నని వొచ్చావూ?

సర్కి—మీరు మర్యాదగా మాట్లాడాలి.

రాఘు:—మర్యాదగా ముందు ఇక్కణ్ణుంచి వెళ్తావా లేదా!

సర్కి:—నేను ఆఫీసర్ని.

రాఘు:—(జాలిగా) ఐతే అయ్యావులే...పోవయ్యా-పోవూ? ఉంగు...మాటల్తో వినేట్టు లేవు... పుల్లాయ్!... ఒరేయ్! పుల్లాయ్!

[పాలేరు పుల్లాయ్ పరుగెత్తుకుంటూ వొచ్చాడు. మనిషి మహా బలంగా వున్నాడు.]

పుల్లా:—ఏలా? పామా - దొరగారూ?

రాఘు:—మనిషేరా! అడుగో...ఇంక నడవండి బాబూ!

సర్కి:—మీరు స్టేటుమెంటు-

రాఘు:—ఒరేయ్! యీ పిచ్చివాణ్ణి అభోషాణ్ణానికి చేతులు విరగదీసి కట్టరా-

సర్కి:—నన్నే? చూడండి - మిమ్మల్నేం చేస్తానో—

(కోపంతో జేబులో చెయ్యిపెట్టాడు. కాని అది యూనిఫారం కాక పోవటం వల్ల పిస్తోలు లేదు. అసలు జేబే లేదు.)

రాఘు:—(నవ్వి) దీపావళీ పిస్తోలన్నా లేదే? చూస్తావేరా పుల్లాయ్?

[పుల్లాయ్, సర్కిల్ నడుం వేసుకున్నాడు. సర్కిల్ పెనుగులాడ సాగాడు. వెంటనే రాఘవయ్యకూడా చెయ్యిచేసుకొని, సర్కిలును నెట్టు కుంటూ భోషాణ్ణందాకా తోసుకుపొయ్యాడు. పుల్లాయ్ వెంటనే పక్కనేవున్న తాడందుకొని సర్కిలును బిగదీసి కట్టాడు. సర్కిల్ పెనగులాట ఇంక లాభంలేదని తెల్సుకొని—]

సర్కి:—నేను సర్కిల్ నని చెప్పినా మీారు వినటంలేదు. ఆ దొంగవెధవ తను సబ్ యినస్పెక్టరని మీాకు టోపీ వేశాడు...

రాఘు:—నీకూ టోపీవేశాడుగా! ఓ సర్కిలూ-నిన్ను నువ్వు దొంగలచేతుల్లోంచి కాపాడుకోలేవు. ఇంక ప్రజల్నేం కాపాడుతావూ? మునసబు వొచ్చేదాకా మెదలకుండా వూరుకో.

పుల్లాయ్! మునసబును కేకేసుకు రారా...

[పుల్లాయ్ వెళ్లిపోయాడు]

సర్కి:—నన్నిలా అగౌరవించటమంటే ప్రభుత్వాన్నే ధిక్కరించారన్నమాట! రేపు నాగూర్చి ప్రభుత్వం మీా మీాద తీవ్రచర్య తీసుకుంటుంది.

రాఘు:—(నవ్వి) నీ కోసమా? బాగానే గ్రహించావే? ఒకవేళ నువ్వు నిజంగా సర్కిలువే అనుకుందాం. ఈ సంగతి ప్రభుత్వంవరకూ వెళ్తే యేమౌతుందో నువ్వు ముందు ఆలోచించు. చేతకాని దద్దమ్మవని నిన్ను వుద్యోగంలోంచి వూడపీకుతారు. అప్పుడు సమర్థుడైన వాడికి, యింకోడికి యీా వుద్యోగం వొస్తుంది; సమర్థుడు సంతోషిస్తాడు!

సర్కి:—మీా మాటలు వింటూాంటే నా వొళ్ళు మండుతోంది.

రాఘు:—నీవాళ్ళు మండిచా, నిన్ను కట్టేసిన మోకూ, ఆ తరువాత భోషాణ్ణమూ, మా కొంపా తగులబడతయ్యానే దిగులు నీకేమీ అక్కర్లేదులే! ఇంత పిచ్చివాడివి విశాఖపట్టణమన్నా పోకపొయ్యావూ!

[నరసమ్మ వొచ్చింది]

సర్కి:—ద్యూటీమీదవున్న నన్ను—

నర:—ఈయ నెవరూ ?

రాఘు:—ద్యూటీమీద వున్నానని చెప్పటాలా ? ఇదుగో! ఇంకో మనిషికూడా బియ్యంపొయ్. ఆకలితో యిక్కడ ఛస్తే మూడునెల్లపాటు కొంపను పాడు పెట్టాలి!

నర:—కట్టేశారెందుకూ ? పోసి వొదిలిపెట్టెయ్యండి.

రాఘు:—అమ్మో! చాలా ప్రమాదమైన జంతువల్లే వుంది. ఇప్పుడు వొదిలేస్తే వూరంతా గోలపుట్టిపోతుంది.

నర:—సరే... నేను చెరువుకు వెళ్తున్నాను.

[నరసమ్మ వెళ్లిపోయింది]

సర్కి:—ఇంత అమర్యాదగా ప్రవర్తిస్తే...

రాఘు:—నోరుకూడా కట్టేసినట్టయితే బాగుండేది!

సర్కి:—పిచ్చిగా వాగబోకండి.

[రాఘవయ్యకు కోపంవచ్చి వొక్క తన్నుతన్ని—]

రాఘు:—ఇక నన్నా పడివుంటావా ? లేదా ?

సర్కి:—నన్ను తంతావ్రా ? రేపు చూడు నాదెబ్బ !

రాఘు:—ఇప్పుడు నాదెబ్బ బాగుందా ?

[పుల్లాయీ, మునసబూ వొచ్చారు]

రాఘు:—అడుగో ! సమయానికి విలేజి ఆఫీసరుగారు కూడా రానేవచ్చారు. ఇంక గోలచేస్తేనూత్రం నిన్ను ఉప్మా చేసిపారేస్తారు...రండి ... మునసబుగారూ ! ఉదయమే ఎర్రబుట్టలు కొన్ని మాయింటిని చుట్టుముట్టినయ్. చివరకు ఎర్రబుట్టకూడా లేకుండా యీ టొంపాయి...

[మునసబు ఆ టొంపాయిని చూసి భయపడి, రాఘవయ్యవంక జాలిగా చూశాడు. రాఘవయ్య మిగతామాటల్ని దిగమింగాడు.]

మున:—వారు సర్కిల్ ఇనస్పెక్టరుగారు !

రాఘు:— (ఆశ్చర్యంతోనూ, భయంతోనూ) సర్కిలా! భుజకీర్తులన్నా లేకపోతే నే నెల్లా గ్రహించేది? కనీసం వొక అట్టమీదన్నా రాసి మెళ్లో వేసుకొన్నట్టయితే నేను పొరబడేవాణ్ని కాదు.

మున:—ముందు ఆతాళ్ళు విప్పండి.

రాఘు:—ఒద్దు బాబూ ! ఒద్దు. ఆయన అసలే కోపంతో వుడికి పోతున్నాడు, ఇప్పుడు విప్పితే నా మీద పడతాడు. ఆ కోపం తగ్గేదాకా అలాగే వుంచుదాం.

మున:—అదేంటయ్యా. ఆఫీసర్ను కట్టేస్తారా? విప్పండి.

రాఘు:—నీదేం పోయిందీ? చెడేది నా వీపు కనుక, విప్ప మంటావ్!

మున:—నువ్వేదో తెలియక అమాయకత్వంలో చేశావ్! కుఱ్ఱాడు తిట్టినా, కొట్టినా మనం పట్టించుకొన్నామా? అంతే! ఆయన నిన్నేమీ అనరులే!

సర్కి:—నే నిక్కడ తాళ్ళు వొరుసుకొని ఛస్తుంటే మీ వాద ప్రతివాదా లేంటయ్యా?

రాఘు:—చూశారా, ఎంత కోపంగా వున్నారో?

సర్కి:—నాకు కోపం లేదు లేవయ్యా, స్వామీ!

రాఘు:—ఐనా కట్టేసింది నేను కాదు ఆ పుల్లాయ్ గాడు! ఒరే పుల్లాయీ! నీ కేమన్నా బుద్ధివుందిరా? వారు పెద్ద మనుషులు! ఆఫీసర్లు! దారితప్పి మనింటికి వొస్తే వార్ని కలుపుల్తో బిగించి కడతావట్రా వెధవా?

పుల్లా:—అదేంటండీ దొరగారూ! మీరు కట్టెయ్య మంటే కట్టేశాను, నాకేం తెలుసూ?

రాఘు:—ఒక వేళ నేను అన్నా, నువ్వు కాస్తనిలబడి ఆలోచించ నక్కర్లా?...సరే, తప్పు జరిగిపోయింది. ఇప్పుడు కనక నువ్వు దొరికావంటే, నిన్ను హూణాం హూణాం చేస్తారు. కనుక, నువ్వు పరారై నీ వీపు కాపాడుకో, వెళ్ళబొయ్యేముందు గొడ్లకు కాస్త మేతవేసి పో... ఆయన యీ వూరినుంచి వెళ్లేదాకా, నీవుచ్చు కాచుకో, పో వెధవా!

[ పుల్లాయ్ వెళ్ళిపొయ్యాడు. ]

సరి:—నేను యెవర్నీ యేమీ అనను, నన్ను విప్పండయ్యా! (ప్రార్థనాస్వరంలో) స్వామీ!

రాఘు:—ఇంతసేపు యెట్లాగూ వున్నారు. ఆ పుల్లాయ్ గాణ్ణి కాస్త పోనివ్వండి...అయిదు నిమిషాలు...

సర్కి:—నాకు మీ ఎవరిమీదా కోపంలేదు బాబూ, నేను ఎవర్నీ యేమీ చెయ్యను.

మున:—విప్పండి రాఘవయ్యగారూ!

[ రాఘవయ్య ధైర్యంచేసి మెల్లిగా కట్లువిప్పాడు. అవమానంతో తలవంచుకొని సర్కిల్ బైటపడి, తాళ్ళకు ఒరుసుకు పోయిన శరీరాన్ని మెల్లి మెల్లిగా నిమురుకోసాగాడు. ]

మున:—తమరు ఏదో అవసరమైన పనిమీద దయచేసి నట్టున్నారు?

సర్కి:—వీరింటికి ఇద్దరు దొంగవెధవలు, ఒకడు సన్యాసి రూపంలోనూ, ఇంకోడు సబ్ ఇనస్పెక్టరు వేషంలోనూ వొచ్చి—

రాఘు:—(మాటమధ్యలో అందుకొని) వొచ్చి ఇంట్లోవున్న బంగారమంతా దోచుకుపొయ్యారు. పోలీసు వేషం మోసంచేసేందుకు ఎంత బాగా వుపయోగ పడ్డదో!

సర్కి:—వాళ్ళను వేటాడేందుకు నేను వొస్తే, నన్నే వేటాడారు!

మున:—వారికి తెలియలేదులెండి. మీరు బ్రెస్సులో వొచ్చారేం?

సర్కి:—పక్కవూళ్ళో క్యాంపులోవున్నా రాత్రి ఆ వెధవ నా యూనిఫారాన్ని దొంగిలించి, అది వేసుకొని తనే సబ్ ఇనస్పెక్టర్నని వొచ్చాడు. నాకళ్ళపడ్డట్టయితే (మిగతాది పళ్ళుకొరికి సూచించాడు)

మున:—మీకే బురిడీవేశాడన్నా?

రాఘు:—ఇంటి దొంగతనానికి సన్యాసి వెధవ వొక్కడూ చాలక, వీడుకూడా పగటివేషంలో రావటం యెందుకో?

సర్కి:—అది తెలివిగా ఆలోచించి చేశారనుకుంటాను సన్యాసి దొంగతనంలో పట్టుబడితే, వాళ్ళకు బంగారమూ దక్కదు; పైన జైలుప్రాప్తికూడాను ఈరకంగా అయితే, ఎవరూ అనుమానించకుండా, నడిబజార్లో, పట్టపగలు దర్జాగా పోవొచ్చని యీ వుపాయం పన్నివుంటారు. నా సైకిల్ నడిచేందుకూ్కడా వీల్లేకుండా - వెధవలు, ట్యూబులూ, టైర్లూ కోసిపారేశారు. ఇంత దొంగవెధవల్ని నేనెక్కడా చూడలేదు.

రాఘు:—నేను చూశాను కాని, దొంగ వెధవలన్న అనుమానమే గలుగలేదు!

సర్కి:—వీళ్ళను వొదుల్తానా? మీరొక స్టేట్ మెంటు యివ్వండి రాఘువయ్యగారూ!

రాఘు:—నా స్టేట్ మెంటు దేనికిస్వామీ! నాకసలే పోలీసు లంటే భయం. పోయిన సొమ్ము పోగా, స్టేషన్ చుట్టూరా, మేస్ట్రేటుకోర్టు చుట్టూరా తిరగలేక - చావు!

సర్కి:—మీ వస్తువుల్ని కూడా పట్టుకుంటాం!

రాఘు:—మీరు పట్టుకునేందుకూ, స్టేట్ మెంటుకూ సంబంధంలేదు. స్టేట్ మెంటు మీకేమీ సహాయపడదు. మీయాని ఫారాన్ని దొంగిలించారని మీరే స్టేట్ మెంటు యిచ్చి, ముందు మీవస్తువులు దొరికే మార్గం చూసుకోండి. తరువాత నాసంగతి చూద్దురుకాని! అదీకాక వాళ్ళు రౌడీ వెధవలు!

సర్కి:—ఏడిశారులెండి!

మున:—సమయంవస్తే వాళ్ళకన్న పోలీసులే ఎక్కువ రౌడీలౌతారు. ఎంత రౌడీతనం వుపయోగించక పోతే డేరా మేకుల్లాంటి వెధవల్ని లొంగతియ్యగలుగుతారూ?

రాఘు:—రౌడీవాళ్ళగోల మనకువొద్దు నేను పెద్దమనుషుల్తో యేదన్నా వ్యవహారం చేస్తానుకాని, రౌడీల జోలికే పోను!

సర్కి:—అనవసరవాదం వొద్దు మీరు స్టేట్ మెంటు—

రాఘు:—నేను యివ్వనుబాబూ! ఇవ్వను.

సర్కి:—మీరన్నా చెప్పించండి మునసబుగారూ!

మున:—ఎవరు చెప్పినా ఆయన వినడు; మనం పోదాంరండి.

[చేసేదిలేక, కరిస్టాలు, మునసబుతో కలిసి వెళ్లిపోయ్యాడు. నరసమ్మ వొచ్చింది]

నర:—ఇందాక ఇక్కడ కట్టేసినాయన ఏడీ?

రాఘు:—ఒదిలిపొయ్యాడు, వాడు సర్కీలేనే!

నర:—(ఆశ్చర్యంతో) నిజంగా!

రాఘు:—నిజమేనే! మొదటివాళ్లిద్దరూ దొంగవెధవలే!

నర:—ఐతే మీరు కోర్టుకు వెళ్ళక్కర్లేదా?

రాఘు:—ఊహుం...ఇంక నీ నగలు పోయినట్టేనే!

నర:—పోతేపోయినయ్ లెండి అవన్నీ పూర్వకాలపువి. చాలా మోటుగా కూడా వున్నయ్. కొత్తవి చేయిద్దురు కాని.

రాఘు:—నీ కల్లాగే వుంటుంది. అవ్వి పోయినందుకు నీకు సంతోషమల్లేవుంది.

నర:—పోనీ మీరు విచారిస్తే విచారించండి. నాకు అభ్యం తరంలేదు. పొయ్యి మండిపోతోంది. నేను పోతాను.

[నరసమ్మ వెళ్ళిపోయింది. పుల్లాయ్ వొచ్చాడు]

రాఘు:—ఏరా, నువ్వు పరారవలా!

పుల్లా:—లేదుబాబూ! మీరుండగా నాకేం భయం? మీరుకూడా ఆయన్ను కట్టేశారుగా? జైలుకుపోయినా ఇద్దరమూ తోడుతోడుగా వుంటాంకదానని, పక్క గదిలోవుండి, అంతా వింటూనేవున్నా.

రాఘు:—సరేలే, పోయి పనిచూసుకో.

[రాఘవయ్యా, పుల్లయ్యా చెరోవైపూ వెళ్ళిపోయారు.]

[ తెర ]

— జూన్, 1946.

# బుద్ధొచ్చింది

శ్యాకినీ ఫిలిమ్స్ స్టుడియోలోని డైరెక్టర్ బ్రహ్మానందం ప్రైవేటుగది. గది మధ్యలో పెద్ద టేబిలూ, దానిమీద ఒక టెలిఫోనూ, కాలింగ్ బెల్లూ, రెండు మూడు గాజు పేపర్ వెయిట్లూ, ఇంకా ఇలాటి ఆఫీసు సామాన్లూ ఉన్నయ్. గదిలో రెండు మూడు సోఫాలూ, నాలుగైదు కుర్చీలూ చిందరవందరగా ఉన్నయ్. పైన సీలింగ్ ఫాన్ తిరుగుతూ వుంది.

గదిగోడలు, శుభ్రంగా తెల్లగా ఉన్నయ్. ప్రసిద్ధ సినిమాతారల ఫొటోలు, స్టుడియో గ్రూప్ ఫొటోలూ గోడలకు వేళ్ళాడు తున్నాయ్.

టేబిల్ కు ఎదురుగావున్న రివాల్వింగ్ కుర్చీలో డైరెక్టర్ బ్రహ్మానందం కూర్చొని, సిగరెట్ కాల్చుకుంటూ, కళ్ళు సగం మూసి దీర్ఘాలోచనలో వున్నాడు. వయస్సు నలభైపైబడ్డా, మనిషి బలంగానే ఉన్నట్లు కనిపిస్తుంది[ ఇప్పటికి కొన్ని దంతాలు మాయమైనా, మాట్లాడేప్పుడు నట్లు పడవు. ఆయన విలువైన సిల్కు సూటుసుపట్టి, కళలావాడే నని తోస్తుంది. మనిషి నల్లగా తుమ్మమొద్దల్లే, అందవికారంగా వున్నా - ఆ కురూపత్వాన్ని గూర్చి ఆయన ఎన్నడూ ఆలోచించినట్టు కనిపించదు; దీనికి ఇది కారణమై వుంటుంది. - దుస్తుల్తో మిగతా లోపాలన్నింటినీ కప్పిపుచ్చ గలుగు తున్నాడుగా! ఆ చిన్న కళ్ళల్లో మోసపుటాలోచనలు కనిపిస్తున్నయ్.

గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. గదిలోని విద్యుద్దీపాలు వెలగటం లేదు గనుక, ఇది ఉదయమై వుంటుంది.

క్షణం నిశ్శబ్దం.

[స్ప్రింగ్ డోర్స్ తెరుచుకొని, ఆఫీసు ప్యూన్ ఖాదర్ వొచ్చాడు. ముసలివాడైనా, దేహపటుత్వం తగ్గలేదు. ]

బ్రహ్మ:—ఏం?

ఖాద:—తమకోసం ఎవరో వొచ్చారు !

బ్రహ్మ:—ఎవరో ఏమిటి — నీ మొఖం? ఆడదా? మొగాడా?

ఖాద:—ఆడవారేనండీ !

బ్రహ్మ:—ఎంతమందేమిటీ?

ఖాద:—ఒక్కారేనండీ !

బ్రహ్మ:—ఎందుకో కనుక్కోలేదూ?

ఖాద:—ఇక్కడ ఫిలిముల్లో నటించేందుకు - తమదర్శనం చేసుకుందామని చెప్పారు—

బ్రహ్మ:— ఏమన్నా బాగుందా?

ఖాద:—చాలా బాగున్నారు ముసలివాణ్ని నామనస్సే చలించిందం టే...

బ్రహ్మ:—ఏడిశావు ! నీమనస్సు ముసలిది అందుకని అది చలించలేదు...ఇంతకూ ఆమె పేరేమిటీ?

ఖాద:—కనుక్కోలేదండీ ! మనిషిమాత్రం......ఆ హాఁహాఁ! మీలాటి నవయువకులకు - యీడూజోడూను !

(తన నవయువకత్వాన్ని స్ఫురింపజేసేందుకు ఒక్కసారి చొక్కా కాలర్లు పైకి ఎత్తాడు.)

బ్రహ్మ:—సరే...ఒక్కపనిచెయ్. ఆమెను మెల్లిగా లోపలికి ప్రవేశపెట్టి, నువ్వు బైటికిజారుకో—

ఖాద:—నా మామూలూ పనే !

బ్రహ్మ:—స్టుడియోలో ఎవ్వరూ లేరుకదా?

ఖాద:—ఆదివారమని అందరూ—

బ్రహ్మ:—ఊరివిూద బలాదూర్లకు వెళ్ళారు కాబోలు !
సరే – పంపు...

[ఖాదర్ వెళ్ళిపోయ్యాడు. గదిలోకి రాబొయ్యే అపరిచితవ్యక్తి కోసం బ్రహ్మానందం కుర్చీలో సర్దుకుకూర్చొని, సిగరెట్ ముట్టించి, ఆఫీసు ఫైలులోకి దీర్ఘంగా చూస్తున్నాడు, మధ్యమధ్య ఒకపక్క తనదృష్టిని ద్వారం వైపు పోనిస్తు – ...

క్షణం గడిచింది.

స్ప్రింగ్ డోర్స్ చప్పుడైనయ్.

పదిహేనేళ్ళ నవయువ్వని ప్రవేశించింది. ఆధునికమైన దుస్తుల్ని ధరించింది. పిరుదుల్ని దాటిన వాలుజడ, ఆమె మందగమనానికి తాళం వేస్తోంది. ఆమె స్వాభావిక అందాన్ని, పైమెరుగులు ద్విగుణీకృతం చేస్తున్నయ్. తెలియనివాళ్ళు ఆమెఇదివరకే ఫిలింస్టార్ అనుకు నే అవకాశాలున్నయ్.]

బ్రహ్మ:—(క్రీగంటచూసి) కమ్ ఇన్ !...కూర్చోండి.

[ఆమె బ్రహ్మానందానికి దగ్గరగావున్న సోఫాలో కూర్చుంది.]

బ్రహ్మ:—తమ పేరు ?

ఆమె:—కుమారి

బ్రహ్మ:—తమకు నాతో ఏంపనో చెప్తారా ?

కుమా:— నేను స్కూల్ ఫైనల్ దాకా చదివాను. చిన్నప్పుడు సంగీతం నేర్చుకున్నాను, మాస్కూలు డ్రామాల్లో కూడా నటించాను. ఆ బాపతు సర్టిఫికెట్లు—

(చేతిలోని హాండ్ బాగ్ లోంచి తియ్యబోయింది)

బ్రహ్మ:—అవసరం లేదు లెండి

కుమా:—చవుస్తు న్నా శేశాక, నా సంగీతజ్ఞానాన్ని వృద్ధి చేసుకున్నారు. సంసార్ స్త్రీని ఫిలిముల్లోకి వొచ్చేందుకు భయపడుతూ సంవత్సరం గడిపాను—

బ్రహ్మ:—మీకు వెనుక, మొగాళ్ళెవరూ లేరా?

కుమా:— తల్లిదండ్రులు చిన్నప్పుడే పొయ్యారు...

బ్రహ్మ:—తమ భర్త—?

కుమా:—(సిగ్గు పడుతూ) ఇంకా పెళ్ళి చేసుకోలేదు...

బ్రహ్మ:—అలా స్వతంత్రంగా ఆలోచించుకొని ముందడుగు వెయ్యాలి—

కుమా:—అందుకే, చదువుకున్న యువతులు మీ ఫిలిమ్ లో నటించేందుకు కావాలని మీరు పత్రికలో వేసిన ప్రకటనచూసి-తమ దర్శనార్థం వొచ్చాను.

బ్రహ్మ:—కిందటి వారంలో "భూకంపం" అనే సామాజిక చిత్రం పూర్తయి, ప్రస్తుతం ఎడిటింగ్ లో వుంది. మా తరువాతి చిత్రం "తార ప్రేమ"—పౌరాణిక చిత్రం.

కుమా:— తారా శశాంకమా ?

బ్రహ్మ:—కాదు. అక్కడే చాలామంది పొరబడతారు. ఈ తార - వాలి భార్య - కథా భాగం రామాయణం లోంచి తీసుకొని, మన స్వంత తెలివితేటల్తో దాన్ని పెంచి, తీస్తాను. ఇందులోకే తారలు కావాల్సి ప్రకటించాను.

కుమా:—ఐతే అందమైన స్త్రీకోసం ప్రకటించాను; బహుశా మీకు కావాల్సింది-అనాకారులనుకుంటాను.

బ్రహ్మ:—ఏం - అలా అన్నారు ?

కుమా:—తారా, వాలీ, సుగ్రీవుడు - వాళ్ళందరూ కోతులు. కనుక మీకు తార పాత్ర వేసేవి కానీ, ఇంకా అలాంటి స్త్రీపాత్రలు వేసేవి కానీ - కోతి లాగు ఉండొద్దా ?

బ్రహ్మ:—వాళ్ళందరూ కోతులన్న మాట నిజమే కాని - కోతుల్లో మాత్రం అందమైనవి లేవా ? తార మహా అందగత్తె అని రామాయణ ప్రమాణం. ఆమెకోసం వాలీ, సుగ్రీవులూ కొట్టుకు చచ్చే వాళ్ళు.

కుమా:—వాళ్ళూ కోతులే ! మనుష్యు లెవరూ ఆమె కోసం కొట్టుకు చావలేదుగా !

బ్రహ్మ:—నిజమే! కాని ఆమె అందాన్ని లోకానికి తెలియపరిచేందుకు - మనుష్యులుకూడా ఆమెకోసం కొట్టుకు చచ్చినట్టు మనం కల్పిద్దాం ... ఇలాంటి సందర్భాల్లోనే మన తెలివితేటలు పనిచెయ్యాలి ! మనకు కోతుల అవసరమే లేదు. నిజంగా అవ్వే అవసరమైతే - ఈచిత్రం ఇండియాలో తీసే అవకాశం లేదు. సౌత్ ఆఫ్రికా పోతేనే కాని - మనిషి ఎత్తు ఉండే - గొరిల్లాకోతులు దొరకవు. మనం కథకుమారుడుగా, సర్కస్ చూపాల్సి

వొస్తుంది. అదీకాక, ఈ మనుష్యజాతి కోతుల్లోంచే వొచ్చిందని డార్విన్ థియరీ చెప్తోంది.

కుమా:—సరే... తారా, ఆమె దాసదాసీజనమూ అందరూ కూడా సుందరీమణులేనన్నమాట ?

బ్రహ్మ:—తప్పకుండాను. అందమైన ఆడదైనా లేకుండా, చిత్రాన్ని మెప్పించలేం... అసలు సంగతి ఏమిటంటే - ఇప్పటికే అప్లికేషన్లు చాలా వొచ్చినయ్. ఇంకా ఎవర్నీ బుక్ చెయ్యలేదు ... లోగడ మీకేమన్నా స్క్రీన్ అనుభవం వుందా ?

కుమా:—లేదు.

బ్రహ్మ:—సంగీతం వొచ్చున్నారు కాదూ ?

కుమా:—ఆc.

బ్రహ్మ:—(ఆమెను పరిశీలించి చూస్తూ) మీ ఆకారమూ, ఫేస్‌కట్టూ, కెమేరాకు బాగానే వుంటయ్... కాని, కెమేరాముందు నటించేందుకు ఇదే మొదటిసారి కనుక... పాత్రపోషణ చెడవొచ్చు—

కుమా:—మీరు అతిసమర్థులైన డైరక్టర్లు మీశుశ్రూషలో పైకి వొచ్చే అవకాశం ఎంతైనా వుంటుందని నాకు గట్టి నమ్మకం వుంది.

బ్రహ్మ:—(ఉబ్బి) అది నిజమే! ఇప్పుడు యీ కొమ్ములు తిరిగిన నటీనటకుల్లో చాలాభాగం నా చేతికింద నలిగిన వాళ్ళే! శాకిసీఫిలిమ్సు వారి తరఫున నేను డైర

చేసిన ఢాకినీ చిత్రంతో — క్రొత్త నటీనటులతో ఎంత మంచిచిత్రం తియ్యొచ్చో నేను లోగడ నిరూపించాను. కాని తొమ్మిది నెల్లక్రితం సుందరి అనే అమ్మాయి యీ స్టుడియోలో జేరింది. చాలా అందంగా నీలాగే వుండేది. ఆమె పాట శ్రావ్యంగా, రికార్డింగ్‌కు వీలుగా వుంది. మొట్టమొదట చిన్న చిన్న పాత్రలు ఇస్తానన్నాను. కాని, ఐదారు నెల్లదాకా వీలైంది కాదు. పాపం — ఆమె దగ్గర ఓర్పు తక్కువ. ఆమె జీతాన్ని ఆమెకు సక్రమంగా ముట్టజెప్తూన్నా, నా మీద అలిగి, అల్లరిచేసి — ఎవరితోనూ చెప్పకుండా వెళ్ళిపోయింది. ఆమె నా మాటలు వింటూ, నా చెప్పుచేతల్లో ఉన్నట్టయితే ఇప్పటికి — తారాపథంలో పెద్దతారై —

కుమా:—"తార ప్రేమ"లో తారపాత్ర వేసేది—

బ్రహ్మ:—వేసి — వెండితెరమీద—

కుమా:—బంగారంలా మెరిసేది !

బ్రహ్మ:—అందుకు సందేహమా ? కాని, నువ్వు మాత్రం ఆమెలా కాకుండా, నా మాట తోసెయ్యకుండా —

కుమా:—తమరు చెప్పిందల్లా చేస్తాను. మిమ్మ ఆశ్రయించి పైకిపాకాలనుకున్న లతను అనుకోండి —

బ్రహ్మ:—ఆ మాట ఎప్పుడూ మరిచిపోకూడదు. మొట్ట మొదటే నాయికా పాత్రల్ని ఇవ్వలేక ఇవ్వలేక

పోయినా, క్రమంగా. నీ సామర్థ్యాన్ని పట్టి - పైపైకి లాక్కుపోతాను. అవకాశాన్ని పట్టి - సిన్సియర్‌గా పని చేస్తూ, నువ్వుకూడా కమ్ముకుపోవాలి. ముందు ముందు, చీటికీ మాటికీ కోపగించుకుంటూ — ఎక్స్‌పీరియన్స్‌ను ఎదిరించి మాట్లాడటం, వాళ్ళను నీచంగా చూడటం — ఇలాంటి వేమీ జరక్కూడదు. నీకు యీ ఫీల్డులో అనుభవం లేదు కనుక, ఇవన్నీ చెప్తున్నాను. ఇప్పుడే అన్నీ బాగా ఆలోచించుకో —

కుమా:—అన్నీ ఇదివరకే ఆలోచించుకొని వొచ్చాను. గౌరవంగా, మీ చాటున పనిచేసుకు పోవాలని నిశ్చయించుకున్నదాన్ని. మిమ్మల్ని ఎదిరించగలనా ?

బ్రహ్మ:—(ఉబ్బి) అలా అణకువగా ఉండాలి. నా మాటల్ని అక్షరాలా పాటించావంటే — రేపీపాటికి నిన్ను గొప్ప తారను చేసేస్తాను. నిన్ను చూసినప్పటి నుంచీ — నీకు ఎంతైనా ఉపకారం చేద్దామనిపించింది —

కుమా:—స్త్రీజనం విషయంలో మీమనస్సు నవనీతం అనుకుంటాను—

బ్రహ్మ:—నీఅంత అందమైన పిల్లను చూస్తే - ఏ పురుషుడు కరిగి నీరై ప్రవహించడూ ?

కుమా:—మీదయకు కృతజ్ఞురాల్ని.

బ్రహ్మ:—కాంట్రాక్టు ఫారంమీద దస్కత్ చేసేందుకు ముందు మీ కేమన్నా అనుమానాలుంటే అడగండి.

కుమా:—అనుమానాలేమీ లేవు. నేను అన్నింటికీ సిద్ధంగానే వున్నాను.

బ్రహ్మ:—జీత విషయంలో ఒక్కమాట చెప్పాల్సివుంది. కొత్తవాళ్ళకు పెద్దజీతాన్ని ఏర్పాటు చేసేందుకు స్టుడియోవాళ్ళు ఒప్పుకోరు. నీ అందమైనకళ్ళూ, విశాల ఫాలభాగమూ, భుజాలవొంపూ, కురుల అందమూ—వీటన్నిటికీ సరైన విలువను ఇప్పట్లో నేను నిర్ణయించలేకపోవచ్చు. నీసంగతి పూర్తిగా గ్రహించాక, నీ జీతాన్నికూడా వృద్ధిచేసేందుకు నాకెట్టి అభ్యంతరమూ లేదు. వ్యాపారదృష్టిలో నీలాటి సౌందర్యవతులు ఎంతైనా ఉపయోగపడతారు. ప్రౌఢగా నటించేందుకు అన్నివిధాలా సరిపోతావు కనుక, నీకోసమన్నా ఐదారు ప్రేమఘట్టాల్ని సృష్టించామంటే - ప్రేక్షకమహాజనం మైమరిచిపోతారు—

కుమా:—ఇంతకూ అసలుసంగతి కానీండి.

బ్రహ్మ:—వొస్తున్నాను. నీ ప్రస్తుతజీతం నెలకు ఎనభై రూపాయిలు. ఇది నా వ్యక్తిగతనిర్ణయం మాత్రం కాదు. వ్యాపారరీత్యా జరిగిన నిర్ణయం. ఇందుకు మీకు ఇష్టమైతే, యీ కాంట్రాక్టుఫారంమీద దస్కత్ పెట్టండి.

కుమా:—మీ నిర్ణయాన్ని నేను కాదనగలనా?

[బ్రహ్మానందం ముఖం వికసించింది. బ్రహ్మానందం ఇచ్చిన కాంట్రాక్టు ఫారం మీద కుమారి దస్కాత్ పెట్టింది.]

బ్రహ్మా:—దట్స్‌రైట్! ఇలా చెప్పిన మాట వినే గుడ్ గరల్స్ విషయంలో ఎంతైనా సహాయం చెయ్యవొచ్చు. డైరెక్టర్ బ్రహ్మానందం మాట తప్పడు! (కుమారి కూర్చున్న సోఫాలోకి జేరి) నీ అందాన్ని చూసి మూర్ఛబొయ్యే ప్రేక్షకుల్ని సృష్టించి పారేసే సామర్థ్యం నాలో వుందంటే నమ్ము.

కుమా:—నన్ను చూసి మీ అంత అనుభవశాలురే మూర్ఛబోతూంటే - ప్రేక్షకులు ఇంకెంత ఘోరంగా మూర్ఛబోతారో నేను తేలిగ్గా గ్రహించుకో గలను!

బ్రహ్మా:—భలే జాణవు!
(నవ్వి, ఆమె చెక్కిలి మీద వేలితో కొట్టి) మొదట ఏమో అనుకున్నాను. విషయాన్ని అలా చప్పుచప్పున గ్రహిస్తూ అల్లుకు పోవాలి, ఒక్కొక్కళ్ళకు ఎంత చెప్పినా తలకెక్కదు. కాని నీలాంటి యువతీ రత్నమైతే - రోజుల్లో అవనిపనిని, క్షణాల్లో అర్థమయ్యేట్టు చేసెయ్య వొచ్చు.

[బ్రహ్మానందం తన కుడిచేతితో ఆమె ఎడమ చేతిని తాకాడు. ఆమె, చిరునవ్వునవ్వి, అతనికి దగ్గరిగా జరిగింది. బ్రహ్మానందం ఆమెను కౌగిలించుకో బొయ్యాడు.

గది స్ప్రింగ్ డోర్సు చప్పుడైనయ్. కంగారుగా బ్రహ్మానందం అటు చూసి, నిశ్చేష్టుడౌతాడు.

[ఒక్క క్షణం నిశ్శబ్దం]

బ్రహ్మ:—(లేచి) ఎవరూ? సుందరా? (కోపంతో) హుం. ఇక్కడికెందుకొచ్చావూ? (తడబాటుతో) ఆ చేతులో కెమేరా ఏమిటీ? డామిట్! ఇంత ధైర్యంగా నా ప్రైవేటు గదిలోకి నా పర్మిషన్ లేకుండా వొచ్చి ఫోటో తీసి నన్ను అగౌరవిస్తావా? చూడు ఇప్పుడు నిన్నేం చేస్తానో! (మాటలురాక ఆగాడు)

[సుందరి వొచ్చింది. కుమారికన్న రెండు మూడేళ్ళు పెద్ద. ఇద్దరి ముఖాల్లోనూ చాలా పోలికలున్నయ్. సుందరి పేరుకుతగ్గట్టు సుందరే!

[సుందరి చేతులో హాండ్ కెమేరా ఊగుతోంది]

సుంద:—కొంచెం తమాయించండి — డైరెక్టర్ గారూ! తమ ఫోటో బాగా రికార్డ్ అయింది. తమ ఫేస్ కట్టు కెమేరాకు బాగా సూటయింది. మీ ముఖానికి మేకప్ లేకపోయినా — ఆహా! ఏం కళ!... రేపు మీ కొక ప్రింటు పంపుతాను...ఇక వెళ్దామటే — చెల్లీ?

కుమా:—(సోఫాలోంచి నవ్వుతూ లేచి, పమిట సర్దుకొని) ఈ ప్రేమఘట్టంలో. నా ఫోటో బాగా పడ్డదటే అక్కా?

సుంద:—ఓ! ప్రేక్షక మహాజనం మూర్ఛపోవాల్సిందే!

బ్రహ్మ:—(విషయం పూర్తిగా అర్థమై) నాన్‌సెన్స్! బుర్ర ఏమన్నా తిరుగుతోందాయేం? ఇప్పుడే పోలీసును ఫోనుతో పిలుస్తాను.

సుంద:—ఊఁ. పిలవండి. మీఫోటోను వాళ్ళకూడా చూపిస్తాను. అంతేకాదు - ఒక కాపీ మీ భార్యామణి గారికి పంపుతే - మీకొక వారంరోజులైనా ఇంటివెలుపల విడిదైదు తప్పదు! ఈ కాపీల్ని మార్కెట్లో పెడితే మహాడిమాండ్ వుంటుంది. ఇదుగో - మాకు టైంఅయ్యింది, శ్రమకు క్షమించండి... శెలవు—

కుమా:—(బ్రహ్మానందంతో) తమరిచ్చిన ఉద్యోగం చాలా బాగుంది నాకు నిజంగా బ్రహ్మానందంగా వుంది!

బ్రహ్మ:—నువ్వు కుమారివి కాదు - నాపాలిట మారివి!

కుమా:—మీకంత కష్టమెందుకు, వెళ్తున్నాలెండి.

[సుందరీ, కుమారీ కలసి రెండడుగులు ముందుకు వేశారు]

బ్రహ్మ:—(ఆత్రుతతో) సుందరీ! ఆగు; నామీద అంత కోపం దేనికీ? నేను నీకేం అపకారం చేశానూ?

[సుందరి ఆగింది]

సుంద:—ఇప్పటికి చేసిన అపకారం చాలక, ఇంకా 'ఏం అపకారం చేశానూ?' అని అడగొచ్చావా? పెద్ద ఫిలింతారను చేస్తానని లేత సొరకాయలు కోశావు. రెండు చిత్రాల్లోనూ నాకు ఒక్కపాత్ర కూడా ఇవ్వకుండా కాలంగడిపావు. నన్ను తారగా కాకుండా, నీ విలాస వస్తువుగా ఉపయోగించుకోవాలనే అభిప్రాయాన్ని బైట పెట్టేందుకూడా, నువ్వు అభిమానపడలేదు. దానికి నేను విముఖత చూపానని, ఇంకో

చోటు చూసుకో మన్నావు. నీకు తలఒగ్గి, నీ అడుగు లకు మడుగు లొత్తుతూ, ఆత్మాభిమానాన్ని చంపు కొని నీ కామతృష్ణ తీర్చేవాళ్ళు - పెద్దవాళ్ళా? నాలాటి అమాయకపు కన్యల్ని ఎంతమందిని నమ్మించి యీ విధంగా మోసగించావో! ఎక్కడికి దాకానో ఎందుకూ- ఇంతకు ముందే నా చెల్లెలికూడా, నాకు చదివిన పాఠాల్నే వల్లె వేస్తున్నావు!

కుమా:—అది ఆయనకు అలవాటే!

సుంద:—ఈ యువతు లందరూ పొట్ట కూటికోసం ఇక్కడ జేరారు కనుక, నీ మాటను తేలిగ్గా తీసెయ్య లేరనే ధీమాతో ప్రతి అందమైన ఆడదాని వెంటా పడతావు. రెండు మూడు సార్లు మంచిగా నీకు చెప్తే తల కెక్కిందా? రేపు వార్తా పత్రికలో "డైరెక్టర్ గారి డైరీ లోంచి" అనే శీర్షికలో - యీ ఫొటో ప్రకటిస్తే- తమ గౌరవ మర్యాదలు ద్విగుణీ కృతమౌతయ్యను కుంటా. మీ రందరూ పెద్ద మనుషులు కాదండీ! మీ పెద్ద తనం యీ ఫొటోలో బైట పడుతుంది!

బ్రహ్మ:—(దివాళాతీసిన సాహుకారు ముఖంవేసి) ఒద్దు — సుందరీ! వొద్దు. నా గౌరవానికి భంగం కలిగించ వొద్దు; నువ్వు ఏమి చెయ్యమంటే - అది చేస్తాను.

కుమా:—నువ్వు చెప్పినవల్లా చేస్తాడటే అక్కా!

సుంద:—పెద్దపులి ఆర్భాటమంతా బోనులో పడక పూర్వమే! బోనులో పడ్డాక, చెప్పినమాట వినక ఏం చేస్తుందీ?... (బ్రహ్మానందంతో) చూడు డైరెక్టర్ బాబూ! ఈ ఫిలిం స్టార్లందరూ నిన్ను ప్రేమిస్తున్నారనీ, వాళ్ళు నీ సేవకులు కనుక, నీ టెలిఫోన్ ఉపయోగించు కున్నంత తేలిగ్గా వాళ్ళను ఉపయోగించు కోవాలనీ ప్రయత్నిస్తున్నావ్. పొట్టకూటికోసం నీ అనుగ్రహం సంపాయించేందుకు – వారు పడే అవస్థా, పొందే వ్యాకులతా భోగివి – నీకేం తెలుస్తుందీ? ఎదుటి వ్యక్తి కష్టాన్నన్నా ఆలోచించేవాడివా?

బ్రహ్మ:—(తలవొంచి, దీనంగా) చాలు సుందరీ! నాకు మంచి గుణపాఠాన్ని బోధించావ్. నా ఫొటో నాకు యిచ్చేసి, నన్ను క్షమించు.

సుంద:—నక్కజిత్తులన్నీ నా దగ్గర పనికిరావు. ఈ నాటికి నీకు తెలిసివొచ్చినా, రేపటినుంచీ నీ ప్రవర్తన యథా ప్రకారంగానే వుంటుంది, నాకు మాత్రం నీ మీద నమ్మకం నహీం, నహీం. నేను చెప్పినట్టుగా చేస్తే— నీ గౌరవం పోకుండా చూస్తాను...

బ్రహ్మ:—సరే చెప్పు,

సుంద:—ఇకముందు ఫిలింస్టార్లను యీ విధంగా అగౌరవించనని రాసి ఇవ్వు.

[ బ్రహ్మానందం అనుమానంగా ఊరుకున్నాడు. ]

సుంద:—ఔను. నాకు చెప్పిన పాఠాన్నే - సుమతీశతకంలో వల్లెవేసిన పద్యంలాగు, ఎక్కాన్ని బట్టీపెట్టిన కుర్రాడిలాగు, నదురూ, బెదురూ లేకుండా ప్రతి స్టారుకూ అప్పగిస్తావు. ఇక ముందు అలా జరగకుండా హామీగా కాగితం రాసిమ్మన్నాను. నువ్వు అవినీతికరంగా ఇకముందు ప్రవర్తిస్తే తప్ప, ఇంకేసందర్భంలోనూ ఆకాగితాన్ని బైటపెట్టను...నన్ను నమ్ము.

(బ్రహ్మానందం విసుగుతో గొణుక్కుంటూ కాగితం రాసిఇచ్చాడు.)

బ్రహ్మ:—ఇంక నా ఫొటో ఇచ్చెయ్.

సుంద:—ఆగు...నన్ను నమ్మించి మోసం చేశావు. ఇక ముందు జీవితంలో నన్నా, నేను సుఖ పడాలి...

బ్రహ్మ:—(విసుగ్గా) దానికి నేనేమీ అభ్యంతరం చెప్ప లేదే!

సుంద:—ఒకరి అడ్డం ఏముంది? నా సౌఖ్యానికి ఒకే మార్గం వుంది. అది నీవల్ల నే అయ్యేపని.

బ్రహ్మ:—చెప్పు చూద్దాం.

సుంద:—చూద్దా మంటే కాదు - చేసి తీరాలి.

బ్రహ్మ:—ముందు చెప్పు.

సుంద:—లోకంలో ధన హీనతే దౌర్భాగ్యం. లోకంలోని ముప్పాతిక అవసరాలు డబ్బుమీద ఆధారపడి ఉన్నయ్. ఇప్పుడు మాకది చాలా అవసరం.

బ్రహ్మే:—డబ్బు ! ఇక్కడ డబ్బు కుప్పలు పోసుకు కూర్చు న్నానా ?

సుంద:—ఆలా ఓ క్రోధించవోకండి. అన్ని సుగుణాలూ మీలోనే ఉన్నయ్. నెలకు రెండు వేలు జీతం తీసు కుంటావు. స్టుడియోలో భాగస్వామివి. ఇదికాక ఇంటి దగ్గర బోలెడు ఆస్తివుంది. పిల్లా పీచూ లేరు. ఏం చేస్తా వయ్యా - యీ డబ్బంతాను ? నువ్వు అనుభవించనూ లేవు - ఇంకోర్ని అనుభవించా నివ్వవు ! లోభత్వంతో నువ్వు సాధించేదీ లేదు ! ఇనప్పెట్టెలో ఇనుముతో పాటే రూపాయిలుకూడా తుప్పు పట్టేదాకా దాయకపోతే - దేశంలో కూటికిమాడే బీద సాదలకో, లేక దేశాభ్యు దయానికి పాటుపడే సంస్థకో ధర్మంచేసి కీర్తి సంపా యించరాదూ ? ... ఇదంతా ఎందుకూ ? నాకు అవ సరమైన డబ్బు ఇవ్వదల్చుకున్నావో లేదో త్వరగా తేల్చు...

బ్రహ్మే:—(బుర్రగోక్కుంటూ) ఎంత కావాలో చెప్పు—

సుంద:—పదివేల రూపాయిలు !

బ్రహ్మే:—(అదిరి) పదివేలు ! ప-ది-వే-లు ! వెధవఫోటో ఖరీదు పదివేలు ! నన్ను చంపేందుకు వొచ్చారు... అంతకన్నా నన్ను చంపెయ్యరాదూ ?

సుంద:—నీబోటివాళ్ళు లేకుంటే, అసలు లోకమే నడవదు. దుష్టులు వుంటేనేకాని, శిష్టులు బైటపడే అవకాశం

వుండదు. ఆదంతా ఎందుకూ? తేల్చిచెప్పెయ్ — ఇవ్వదల్చుకున్నావో లేదో!

(బ్రహ్మానందం ఆలోచనలో పడ్డాడు.)

కుమా:—రావే అక్కా! ఈయనతో మనకు బేరం కుదరదు—

(సుందరీ, కుమారీ వెళ్ళేందుకని లేచారు.)

బ్రహ్మ:—ఆగు...సుందరీ!...పదివేలా?

సుంద:—పదివేలే! చాలా తక్కువఅడిగాం! త్వరగా అటో ఇటో తేల్చుకో—

బ్రహ్మ:—అంత తొందరెందుకూ? ... చూడు: ఐదువేలు తీసుకొని తృప్తిపడు.

సుంద:—ఎబ్బే! ఇదేమన్నా వంకాయల బేరమా? పదివేలకూ చిల్లిగవ్వ తక్కువైనా ఫొటో ఇవ్వను—

బ్రహ్మ:—పోనీ - ఎనిమిదీ...

సుంద:—ఇంకో రెండు కలుపు.

[బ్రహ్మానందం మాట్లాడలేదు]

సుంద:—రావేచెల్లీ - వెళ్దాం.

బ్రహ్మ:—ఆగు సుందరీ! - పదివేలూ ఇచ్చుకుంటాను.

సుంద:—అట్లా దార్లోకిరా - తే...త్వరగా!

[బ్రహ్మానందం నీరసంగా లేచి, డబ్బు తెచ్చేందుకు పక్కగదిలోకి వెళ్ళాడు.

కుమా:—అంతా అనుకున్నట్టే జరిగిందే అక్కా! పాచిక పారింది. ఇంతకూ వీడు మనకు ఏజన్మానో పదివేలూ ఋణం! ఏమైనా మంచి గుణపాఠం నేర్పావు.

సుంద:—సముద్రంలో కాకి రెట్టలాగు - వీడు ఏమూలకూ? ఈడబ్బు ఇస్తాననిపించేందుకే-కిందపెట్టి నీళ్ళుపొయ్యాల్సి వొచ్చినంతైంది. చచ్చాక వీడి శవం కరెన్సీనోట్లతో కాని తగలబడదనుకుంటాను. మనం యీ పదివేలూ తీసుకు వెళ్ళాక గుండె పగిలి చావడు కదా?

కుమా:—ఛస్తే వీడ విరగ్గడై పోతుంది.

సుంద:—అడుగో వొస్తున్నాడు - అరవొకొక.

[బ్రహ్మానందం చేతులో నోట్లకట్టల్తో వొచ్చాడు]

బ్రహ్మ:—(సుందరికి నోట్లు అందిస్తూ) నా సర్వస్వమూ అర్పిస్తున్నాను—

సుంద:—(లెక్కపెట్టుకొని) ఈ వెంకటేశ్వర ముడుపును ఇందాకనే చెల్లిస్తే సరిపొయ్యేది!

బ్రహ్మ:—ఆ ఫోటో ఇచ్చెయ్—

సుంద:—ఇవ్వాల్సిందే?

బ్రహ్మ:—(దీనంగా) ఇంకానన్ను ఏడిపించాలా?

సుంద:—(కెమేరా అందిస్తూ) తీసుకో...ఈసంగతి ఎక్కడైనా బైట పెట్టావంటే - నీ పరువే పోతుంది. మేము వెళ్ళబొయ్యేముందు ఒక్కమాట. అసలు నీఫోటో పడనే లేదయ్యా! డబ్బుల్లేక, కెమేరాలోకి ఫిలిం కొనలేదు.

గాభరా పడవోక, ఫిలింతీసి మీరు డబ్బు సంపాయిస్తే, ఫిలిమే లేకుండా మేము డబ్బు సంపాయించాం అంతే భేదం !

కుమా:—వెళ్ళివొస్తాం సార్ —

[ఇద్దరూ వెళ్లిపొయ్యారు. బ్రహ్మానందం తెల్ల మొగంవేసి ఒక్క క్షణం బిగుసుకు పొయ్యాడు. వెంటనే—టేబిల్ మీది కాలింగ్ బెల్ను కొడుతూ]

బ్రహ్మ:—(గది దద్దరిల్లే స్వరంలో) ప్యూన్ ! ప్యూన్ !

[ఖాదర్-ఊడిపోతూన్న తలగుడ్డను చుట్టుకుంటూ పరుగెత్తుకుంటూ వొచ్చాడు]

ఖాద:—సార్!...తేలో పామో అనుకొని వొచ్చాను.

బ్రహ్మ:—ఏడిశావ్! సమయానికి మాయ మాటాలు వెధవలు! తేలూ, పామూ ఐనా అంత ప్రమాదమైనవి కావు.

ఖాద:—పులీ, సింహమూ, ఎలుగుబంటీ.

బ్రహ్మ:—అవ్వేవీ కావు ... ఆ షీ డెవిల్స్ - ఇంకా యీ కాంపౌండ్లో ఉన్నారట్రా ?

ఖాద:—ఎవరు బాబూ ?

బ్రహ్మ:—ఆ సుందరీ - దాని చెల్లెలూను !

ఖాద:—వాళ్ళా ? వాళ్ళు అప్పుడే టాక్సీలో ఎక్కి తుఱ్ఱుమన్నారు!

బ్రహ్మ:—ఇంత సేపట్రా షికారు? తిండికి తిమ్మరాజువీ, పనికి పోతరాజు వీను.

ఖాద:—నా పేరు ఖాదర్ సార్! - పోతరాజు కాదు.

ఖాద:—వాళ్ళు ఇచ్చే ఇరవై రూపాయిలకూ, మీ జేబు లోని ముప్ఫై రూపాయిలూ, కలిపి నెలతిరగంగానే, నా చేతులో పడెయ్యండి.

బ్రహ్మ:—ఇదట్రా నీ ఉపాయం? నెలనెలకూ నా చేతిది వొదిలించుకునేదా?

ఖాద:—వాళ్లు పది వేలకూ కుచ్చుటోపీ తగిలిస్తే బాగుండేం!

బ్రహ్మ:—ఆ మాట ఇక్కడ అంటే అన్నావ్. కాని, ఇంకెక్కడా అనవోక.

ఖాద:—మరి నేను అడిగింది.

బ్రహ్మ:—సరే లే.

ఖాద:—ఇప్పుడు మాట అని, తరువాత ఎగకొడదామని చూస్తున్నారేమో! ఏ నెలైతే ముప్ఫై రాలదో - ఆ నెలే మిమ్ము గూర్చి టామ్ - టామ్!

బ్రహ్మ:— ఫ్యూను వెధవకూ్కడా ఎంత అలుసయ్యాను! (గొణుక్కుంటూ) పొద్దున్నే లేచి ఎవరి మొహం చూశానో కాని.

ఖాద:—పొద్దున గది చిమ్మేందుకు వొచ్చేప్పటికి, అద్దంలో మీ మొహం మీరే చూసుకుంటున్నారు సార్!

బ్రహ్మ:—ఏడిశావ్ - ఫో.

(ఫ్యూన్ వెళ్ళిపొయ్యాడు. బ్రహ్మానందం కుడిచేతులో గడ్డం ఆనించి నేల చూపులు చూస్తున్నాడు. తెర పడ్డ.)

—జూలై, 1939.

(ఎల్డ్విన్ కథ చదివాక)

# శ్రీ మహాభారతము: వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు - 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణ పర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| ఆనుశాసనిక పర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల రు 37–8–0

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాంతం కైఫీయతు | 1 | 0 | నేనూ మా కాంతం | 1 | |
| మునిమాణిక్యంనాటికలు | 1 | 0 | మునిమాణిక్యం కథలు | 1 | |
| ఉపాధ్యాయుడు | 1 | 0 | కాంతం కాపురం | 1 | |
| శరద్రాత్రులు | 1 | 0 | దీక్షితులు | 1 | |
| రుక్కుతల్లి | 1 | 0 | తగూ నెంబరు శ్రీ | 1 | |
| యథార్థ దృశ్యాలు | 1 | 0 | వినోదవ్యాసములు | 1 | |
| కాంతం | 1 | 0 | నా స్నేహితులు | 1 | |
| హాస్యకథలు | 1 | 0 | దాంపత్యజీవితము | 1 | |
| తల్లిప్రేమ | 1 | 0 | రేడియో నాటికలు | 1 | |
| కథానికలు | 1 | 0 | రాధబాబు | 1 | |
| తిరుమాళిగ | 1 | 0 | మేరీ కహానీ | 1 | |

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాలక్షేపం 1 వ భా॥ | 1 | 0 | మాయలమాలోకం | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | అవును | 1 | 0 |
| గుసగుస పెళ్ళి | 1 | 0 | నిజం | 1 | 0 |
| ఇప్పుడు | 1 | 0 | మాటవరస | 1 | 0 |
| అప్పుడు | 1 | 0 | తనలో | 1 | 0 |
| అన్నీ తగాదాలే | 1 | 0 | మేజువాణీ | 1 | 0 |
| రెండు రెళ్ళు | 1 | 0 | మన తెలుగు | 1 | 0 |
| పెళ్ళి ట్రెయినింగ్ | 1 | 0 | లోకోభిన్నరుచిః | 1 | 0 |
| రాక్షసగ్రహణం | 1 | 0 | చెప్పలేం ? | 1 | 0 |
| వసంతసేన | 1 | 0 | ఈడూజోడూ | 1 | 0 |
| ప్రణయరంగం | 1 | 0 | వినయప్రభ | 1 | 0 |

## శ్రీ ధనికొండ హనుమంతరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| తీర్పు | 1 | 0 | ప్రణయాన్వేషి | 1 | 0 |
| పవిత్రులు | 1 | 0 | దేవకన్య | 1 | 8 |
| ఇలవేల్పు | 1 | 8 | అనాథ | 1 | 8 |
| జ్ఞాని | 1 | 0 | అపనింద | 1 | 0 |
| బుద్ధిశాలి | 1 | 0 | చక్రి | 1 | 0 |
| ప్రమాదాలు | 1 | 0 | స్వార్థపరులు | 1 | 0 |
| కుక్కతోక | 1 | 0 | యుద్ధఖైదీ | 1 | 0 |
| ప్రియురాలు | 1 | 0 | గోడ్రాలు | 1 | 0 |
| సంజీవి | 1 | 0 | ఎర్రబుట్టలు | 1 | 8 |
| గర్వభంగం | 1 | 0 | సేవిక | 1 | 0 |
| పరిశోధన | 1 | 0 | శిక్ష | 1 | 0 |
| కాముకి | 1 | 0 | మధురకల్యాణం | 1 | 0 |
| లోకచరిత్ర | 1 | 8 | | | |

## శ్రీ చందూరి నాగేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| భానుమూర్తి భార్య | 1 | 0 | మహాబలిపురం | 1 | 0 |
| మాంగుళూరు మెయిల్ | 1 | 0 | నట్టింట దీపం | 1 | 0 |
| అంతేనా | 1 | 0 | భాష | 1 | 0 |
| ఆఖరుకోరిక | 1 | 0 | కొన్నిగ్రంథాలు | 1 | 0 |
| కాఫీ మానెయ్యడం | 1 | 0 | పరిచయంచేసిన | | |
| ఎక్కడికి కమలా? | 1 | 0 | 'పుస్తకాలు | 1 | 0 |
| అన్యాయం | 1 | 0 | మనకీ ఒకకారు | 1 | 0 |
| శివరావు | 1 | 0 | క్రొత్తలోకాలు | 1 | 0 |
| కలడో లేడో | 1 | 0 | సీతతో సినిమాకి | 1 | 0 |
| రాధ నవ్వింది | 1 | 0 | | | |

## శ్రీ జి. జాషువాకవిగారి ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 1వ భా॥ | 1 | 0 | ముంటాజమహాల్ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | నాకథ (జీవితం) | 1 | 8 |
| డిటో 3 వ భా॥ | 1 | 0 | గబ్బిలము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 4 వ భా॥ | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| డిటో 5 వ భా॥ | 1 | 0 | పిరదౌసి | 1 | 0 |
| నేతాజీ | 1 | 0 | స్వయంవరము | 1 | 0 |
| బాపూజీ | 1 | 0 | తెరచాటు—కల్పిత నాటకము | 1 | 8 |
| కాందిశీకుడు | 1 | 0 | | | |
| స్వప్నకథ | 1 | 0 | మీరాబాయి—చరిత్రాత్మక నాటకము | 1 | 8 |
| రాష్ట్రపూజ | 0 | 5 | | | |

## శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి

## ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉమర్ ఖయాం | 1 | 0 | శబరి | 1 | 0 |
| పంచవటి | 1 | 0 | మృత్యుంజయం | 1 | 0 |
| బృందావనము | 1 | 0 | శృంగారచాటువులు | 1 | 0 |
| సుభాషితము | 1 | 0 | | | |

## శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి

ఆంధ్రపౌరుషము (పద్యకావ్యము) 1—0—0

## వేగుచుక్క గ్రంథమండలి. (బరంపురం) వారి

## అపరాధ పరిశోధక నవలలు

వాడేవీడు 1 వ భాగము 1—8—0

| | | |
|---|---|---|
| నేనే | 2 వ భాగము | 1—8—0 |
| కాలూరాయి | 3 వ భాగము | 1—8—0 |

(ఈ పై మూడును కలిసి జమిలియా కథ యగును.)

| | |
|---|---|
| వేంకట్రావు | 1—8—0 |
| కోటీశుతనయ | 1—8—0 |
| విద్యార్థివిపత్తు – (కర్లపాలెం కృష్ణారావుగారు) | 1—0—0 |

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారి నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| సీతారామరాయలు | 2 | 0 | పూర్ణానందము | 2 | 0 |
| రాజసింహ | 2 | 0 | దృఢప్రతిజ్ఞ | 1 | 8 |
| మృణ్మయి | 1 | 8 | వసుమతీవసంతము | 2 | 0 |
| సంపూర్ణ శ్రీకృష్ణ చరిత్ర | | | అపరాధిని | 1 | 8 |
| 1 వ భా॥ | 1 | 8 | ప్రణయచాంచల్యం | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 | రజని | 1 | 0 |
| అపరాజిత | 1 | 8 | వంగవిజేత | 1 | 8 |
| మధుర | 1 | 8 | నౌకాభంగం 1 వ భా॥ | 2 | 0 |
| మృణాళిని | 1 | 8 | డిటో 2 వ భా॥ | 2 | 0 |
| విషవృక్షము | 1 | 8 | నూర్జహాను | 2 | 0 |
| కృష్ణకాంతుని మరణ | | | అల్లాహో అక్బరు | 1 | 8 |
| శాసనము–పరిశోధక | | | జమీందారు – | | |
| నవల | 1 | 8 | రామరాజు | 1 | 8 |
| కమలాకాంతుడు | 0 | 6 | క్షమార్పణ | 2 | 0 |
| శకుంతల | 1 | 0 | | | |

## కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నవలలు

| | | |
|---|---|---|
| అహల్యాబాయి | 1 | 8 |
| రాజరత్నం | 1 | 8 |
| కృష్ణవేణి | 0 | 12 |
| హేమలత | 1 | 4 |
| కర్పూరమంజరి 1వభా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయం | 1 | 4 |
| సౌందర్యతిలక 1వభా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| వినోదములు 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Tales of Rajasthan అను రాజస్థానకథావళి 1 భా | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | 0 | 8 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Lives of Great men మహాపురుషుల జీవితచరిత్రలు 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మహాపురుషుల జీవిత చరిత్రలు 3 వ భా॥ | 1 | 8 |
| రామకృష్ణ పరమహంస Life and Teachings | 1 | 0 |
| ప్రహసనమంజరి | 1 | 0 |
| నవ్వులగని 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| నానక్ చరిత్ర | 0 | 12 |
| గురుగోవింద చరిత్ర | 0 | 12 |
| సిద్ధార్థ చరిత్ర–గౌతమ బుద్ధుని జీవితం | 1 | 0 |
| రఘుకులచరిత్ర – రఘువంశం | 0 | 10 |
| సుధాశరచ్చంద్రము 300 పే॥ Lake of Palms | 2 | 0 |
| గణపతి హాస్యనవల 1 భా | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| నందచరిత్ర | 0 | 6 |
| కృపాంభోనిధి (భక్త చింతామణిలో వలెనే భక్తిరస పద్యములు కలవు) | 0 | 4 |
| భారతకథామంజరి | 0 | 8 |

## శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారి పరిశోధక నవలలు

| | | | |
|---|---|---|---|
| భీషణ ప్రతిహింస | 1 | 8 | 0 |
| ఘోర ప్రతిక్రియ | 1 | 8 | 0 |
| బలవంతరావు | 1 | 8 | 0 |

## అపరాధ పరిశోధక నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| వలపులరాణి | 1 | 0 | రక్తవాహిని | | |
| అగ్గిరాముడు | 1 | 0 | (5 హత్యలా!) | 1 | 0 |
| భయంకరుడు 1 భా | 1 | 0 | ఇంద్రజాలము | 1 | 0 |
| నరేంద్రుడు 2 భా | 1 | 0 | రాజద్రోహి | 1 | 0 |
| రమేశబాబు | 0 | 12 | అర్థరాత్రి వింత | | |
| సర్కిల్ రంగనాథన్ | 1 | 0 | (3 హత్యలు) | 1 | 0 |
| శకుంతల బి. ఎ. | 1 | 0 | దురాశ 1 భా | 1 | 0 |
| నీవేనా ? | 1 | 0 | డిటో 2 భా | 1 | 0 |
| శక్తికుమార్ | 1 | 0 | దొంగలనాయకుడు | 1 | 0 |
| పంజాబు మెయిలు | 1 | 0 | మోహపిశాచం | | |
| కన్నపుదొంగ 1 భా | 1 | 0 | (270 పే॥) | 1 | 8 |
| పగటిచుక్క 2 భా | 1 | 0 | కాలసర్పము 1 భా | 1 | 0 |
| డిటో 3 భా | 1 | 0 | డిటో 2 భా | 1 | 0 |
| (యీ 3 మూడుభాగములు | | | ఆనందభవనము | 1 | 0 |
| చదివిన కథపూర్తియగును.) | | | మిస్ మధురిక | 1 | 0 |
| రమాసుందరి 1 భా | 1 | 0 | వ్యామోహము | 1 | 0 |
| డిటో 2 భా | 1 | 0 | విషహృదయం | 1 | 4 |

| | | | |
|---|---|---|---|
| నేనం చేలేతంటా | 1 8 | హాతింతాయి | 0 12 |
| ఛాందసుడు | 0 12 | మగడుకాని మగడు | 1 0 |
| అల్లరిపిల్ల | 0 12 | | |

## తల్లావఝుల శివశంకరశాస్త్రిగారి

| | | | |
|---|---|---|---|
| జీవనసంధ్య అను తేజసింగు | 1 8 | చదువుకున్నభార్య | 1 0 |
| జీవనప్రభాతము అను రఘునాధజీ | 1 0 | ధర్మరాజు | 1 8 |
| లవంగలత | 1 8 | నేనెవరి భార్యను | 1 0 |
| | | నేనెవరి భర్తను | 1 0 |

## శ్రీ వత్సవాయి రాయజగపతి వర్మగారి

| | |
|---|---|
| మోడరన్ మేరేజస్ | 1 8 0 |

## శ్రీ పొక్కులూరి రామచంద్ర శర్మగారి

| | |
|---|---|
| హిందీ తెలుగు కోశ్ | 6 0 0 |

వలయువారు:—

## కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి



## ధనికొండ హనుమంతరావు

జననం 4—3—1919. విద్యాభ్యాసం—మచిలీపట్టణం, ఏలూరు, గుంటూరు. బి. ఏ. వరకూ చదివారు.

1940 నుంచీ రచనలు సాగించారు. అప్పట్లో రాసిన నవలలు, 'లోకచరిత్ర' 'ఇలవేల్పు' యింకా మరికొన్ని కథలు, నాటికలు ఆంధ్రుల మన్ననలనేగాక, కన్నడ భాషలోకి అనువదించబడి, కన్నడుల మెప్పుకోళ్లను కూడా పొందినవి.

'ఎర్రబుట్టలు' అనే పుస్తకంలోని నాటికలు అనేకసార్లు ప్రదర్శించబడి విశేష ప్రచారమయాయి. నాటికలు హాస్యప్రధానం కావటంవల్ల ప్రేక్షకరంజకాలయాయి.

'అక్షరజ్ఞానం ఉన్నట్లయితే సాహిత్యాభిలాషి అయే అవకాశం ఇవ్వాలి' అనేదాన్ని వీరు నమ్ముతారు. శైలి సులభం; భావం తేలిగ్గా అర్థమయ్యేదిగానే ఉంటుంది. ఇది కారణంగానే పఠితల అభిమానాన్ని వీరు పొందగలిగారు.

